# ఈసంచికలో



ముఖచిత్రం : సంక్రాంతి సుందరి

చిత్రకారుడు: వడ్డాది పాపయ్య




మీ పత్రిక వ్రాసే సంపాదకీయం చదువుతుంటే మరే పత్రికా మీ పత్రికకు సరిసమాన మవలేదనిపిస్తుంది. ముఖ్యంగా మీ పత్రిక సంపాదకీయాలు, "రేడియో" "గుల్లాతీ" సంఘం గురించి మీరు వ్రాసే వ్రాతను చూస్తుంటే, చదువుతుంటే ప్రతి తెలుగు వాడు మీ పత్రిక సంపాదకీయానికి తలొగ్గ వలసిందే.

పాం|డింకి,
రంగూన్.

డిసెంబరు నెల 'యువ' చూసి కొన్ని పేజీలు త్రిప్పేసరికి 'గోపీచంద్'గారి ఫోటో, వారి సంగ్రహ జీవిత చరిత్ర చదివి, 'ప్రేమోపహతులు' వ్రాసినది 'శాయన్న'గా గోపీచంద్ గారే అని నిర్ణయించుకుని వారి హటాత్ మరణమునకు చాలా బాధ పడ్డా! ఏమైనా మీరు వారి అసంపూర్తి సీరియల్ 'ప్రేమోపహతులు'' తిరిగి పుస్తకములో ప్రచురిస్తారని ఆసిస్తున్నా!

ఎస్. వి ఎస్. మూర్తి,
విశాఖపట్టణము.

యువ రచయితలు మా "యువ" కెంతో వన్నె తెచ్చారు. ముఖ్యంగా, ఆదివిష్ణు, హవీస్‌గార్లు వారి చాకచక్యాన్ని మరొకసారి మాపై విసిరారు. శ్రీ వడ్డాది పాపయ్యగారిని తలవని రోజు లేదంటే అతిశయోక్తి కాదేమో. దయచేసి వారి ఛాయా చిత్రాన్ని త్వరలో మాకు చూపగలరని నమ్ముచున్నాము.

సి. గోవర్ధనరావు,
మచిలీపట్నం.

ఆంధ్రుల అభిమాన రచయిత కీ॥ శే॥ గోపీచంద్‌గారికి గురించి "యువ" ద్వారా యింత చక్కగా పరిచయం చేసినందుకు నా అభివందనాలు. చిరునవ్వులు చిందించే గంభీరమైన శ్రీ గోపీచంద్ చిత్రాన్ని చూస్తుంటే, ఆంధ్రమాత దురదృష్టం వెల్లడౌతోంది. ఆయన నిజంగా "అజరామర చైతన్య స్రవంతి" యే! ఆయన ఆత్మకు శాంతి చేకూరాలని ఆకాంక్షించే, అభిమాని.

డి. ఎస్. రామబ్రహ్మం,
తెన్నేరు.

సుప్రసిద్ధ రచయిత శ్రీ గోపీచంద్ (చీకటిగదుల రచయిత) అస్తమయ వార్త మమ్మ అశేష దుఃఖసాగరాన ముంచి వేసింది. మా గాఢ సంతాపాన్ని (ఈ లేఖ ద్వారా) తమరు వారి కుటుంబానికి తెలియ చేయవలసినదిగా కోరుతున్నాము.

వి. ఆర్. కె. రాజు, వి.ఎస్. రాజు,
లంకలకోడేరు.



"ఏమిటీ!
ఇంట్లో
# అమృతాంజనం
లేదా?

## నా కండరాల నొప్పి తగ్గటానికి ఏం చేయాలి?"

ఏమో ఎప్పుడు అవసరమొస్తుందో ఎప్పుడూ అమృతాంజనం దగ్గర వుంచుకోవటం ఉత్తమం. అమృతాంజనం యింట్లో వుందంటే మీరు నిశ్చింతగా వుండవచ్చు.




అమృతాంజన్ లిమిటెడ్
14/15 లజ్ చర్చిరోడ్డు, మద్రాసు-4
బొంబాయి-1, కలకత్తా-1, న్యూఢిల్లీ-1.

JWT-AM 1882





# యువ

## సచిత్ర మాస పత్రిక

సంచాలకుడు : చక్రపాణి

సంపుటి 7 | జనవరి 1963 | సంచిక 1


చైనా దురాక్రమణ ఫలితంగా దేశంలో అసాధారణపరిస్థితి ఏర్పడింది. ప్రస్తుతం, చైనాసైన్యాలు వెనక్కుతగ్గినా, మళ్ళీ ఎప్పుడో హఠాత్తుగా ముందుకురావచ్చు. అలాటిసందర్భం ఏర్పడకుండా మనకూ చైనాకూ ఏదైనా ఒడంబడిక కుదిరినప్పటికీ యీనాటి స్థితిగతులనుబట్టి మనం నేర్చుకోవలసిన పాఠం ఏమిటంటే, ఇకముందు మాత్రం మనం ఎల్లప్పుడూ ఏ విధమైన యుద్ధచర్యలకైనా తయారుగా వుండాలని.

నేటి పరిస్థితులలో, స్వాతంత్ర్యరక్షణకు ఎల్లప్పుడూ తయారుగా వుండాలంటే, సైన్య, నౌకా, విమాన దళాలను విస్తారంగా పెంచడమేకాక, ఆ బలాలకు అత్యంత ఆధునిక యుద్ధపరికరాలను ఉపయోగించడంలో తర్ఫీదు నివ్వడమూ, అత్యంత ఆధునిక యుద్ధసామాగ్రిని చేకూర్చి పెట్టుకోవడమూ చాలా అవసరము. ఈ విషయంలో మనం ఏమాత్రం వెనుకపడివున్నా, ఎప్పుడో ఒకప్పుడు ప్రమాదస్థితిలో పడకపోము.

అయితే, మనసైన్యాలు ఎల్లప్పుడూ మంచి తయారీలోవుండి, మన సైన్యాలకు అత్యంత ఆధునిక యుద్ధసామాగ్రిని మనం అందించాలంటే, రక్షణశాఖ పద్దుక్రింద

యీనాడు మనం ఖర్చుపెడుతున్న డబ్బు చాలదు. దీనికి పదిరెట్లయినా ఖర్చుపెడితేగాని, మన సైన్యాలు ఎటువంటి అవాంతర పరిస్థితులనైనా ఎదుర్కొనగలిగే సామర్థ్యాన్ని పొందజాలవు. ఇంత డబ్బు ఎక్కడనుంచి వస్తుంది?

మన దేశరక్షణకు, మన స్వాతంత్ర్య రక్షణకు కావలసిన ఏర్పాట్లను చేసుకోవడానికి మనం ఇతరదేశాలదగ్గరకు వెళ్ళి ముష్టి ఎత్తలేము. ప్రమాదం ఏర్పడినప్పుడు, ఇతరదేశాల సహాయాన్ని అర్థించడం వేరు; మామూలు పరిస్థితులలో మన రక్షణ కలాపాలను పటిష్ఠం చేసుకోడానికి సహాయం అడగడం వేరు. ప్రమాద పరిస్థితులలో సహాయం చెయ్యడానికి ముందుకు వచ్చినవారు, మామూలు పరిస్థితులలో ముందుకు రారు. అప్పుడు మన ఏర్పాట్లు మనం చేసుకోవలసిందే. దానికి కావలసిన డబ్బును మనం పోగుచేసుకోవలసిందే.

మామూలుగా రక్షణశాఖ వ్యయం అంతా, కేంద్రప్రభుత్వమే భరిస్తుంది. కేంద్ర ప్రభుత్వానికి వచ్చే ఆదాయం అంతా పన్నులవల్లనే అనే సంగతి అందరికీ తెలుసు. రక్షణవ్యయం ఎక్కువైనకొద్దీ, ప్రభుత్వం పన్నులుకూడా ఎక్కువ చెయ్యవలసిందే. ప్రపంచంలోని అన్ని దేశాలతోనూ పోల్చిచూస్తే, మన దేశంలోనే పన్నులు తక్కువ. పూర్వకాలంలో, ప్రతి కుటుంబమూ తమ ఆదాయంలో ఆరవవంతును రాజులకు పన్నుగా ఇచ్చేవారు. కాని, ఒక రాజ్యంపై, మరొకరాజు దండయాత్రకు వచ్చినప్పుడు, ప్రతి గ్రామంనుంచీ అనేక విధాలుగా ఆ ప్రాంతపు ప్రజలు తమ రాజ్యపు సైన్యాలకు సహాయం చేసేవారు. అయినప్పటికీ, తమరాజు ఓడిపోయినప్పుడు పరరాజు సైన్యాలు ఓడిపోయిన ప్రాంతంలోని గ్రామాలను దోచుకొనిపోయేవారు. అలాంటి పరిస్థితులు యిప్పుడు లేవు. మన దేశమంతా ఒకరాజ్యం అయింది. ఒక ప్రాంతంమీద మరొక ప్రాంతపు రాజులు దాడిచేసి, దోచుకుపోయే కాలం గడచిపోయింది. ఈనాటి పరిస్థితి ఏమిటంటే, మనదేశపు స్వాతంత్ర్యాన్ని మనం కాపాడుకోవడమో, లేక స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకోవడమో. రెండవ పరిస్థితికి అంగీకరించే ద్రోహులు దేశంలో వుండరు.

ఇక మన స్వాతంత్ర్యాన్ని కాపాడుకోవాలంటే, మన దేశంలో ప్రారంభించిన ప్రణాళికలను పూర్తిగా అమలు జరిపి దేశంలోని ప్రజలంతా హాయిగా జీవించే

ఏర్పాట్లను చేసుకోవాలంటే, ఈనాడు మనం ఎన్నో త్యాగాలను చెయ్య వలసిందే.

ప్రతి మనిషికీ డబ్బు బాగా సంపాదించాలని వుంటుంది. ఆ డబ్బుతో తన జీవితాన్ని సుఖంగా గడపాలని వుంటుంది. తన బిడ్డలూ, మనుమలూ సుఖంగా జీవించేటట్టు వారికి మస్తుగా డబ్బు యిచ్చిపోవాలని వుంటుంది. కాని తన జీవితానికీ, స్వేచ్ఛతో కూడిన మనుగడకూ, తన బిడ్డల ప్రాణాలకూ ముప్పు వచ్చినప్పుడు, తన డబ్బును అలాగే దాచుకొని కూచునేవాడు ఎవడైనా వుంటాడా ! ఈ విధంగా ఆలోచించినట్లయితే, మన సర్వస్వాన్ని ఇచ్చి అయినా, మన సైన్యాల స్తోమతను ఎక్కువ చెయ్యవలసిన అవసరం మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

ఈనాడు ఎంతోమంది, రక్షణనిధికి తమ శక్తికొలదీ డబ్బు ఇస్తున్నారు. ఇలా ఇచ్చే డబ్బును విరాళాలని అంటున్నారు. అది తప్పు. మన రక్షణకోసం మనం ఖర్చుపెట్టే డబ్బు విరాళమౌతుందా ? మన ఇంట్లో దొంగలు పడకుండా కాపలా కాచే మనిషికి మనం ఇచ్చే డబ్బు విరాళమౌతుందా. రక్షణనిధికి విరాళం ఇవ్వాలనే భావమే తప్పు. రక్షణనిధి పెరగడానికి, మన వంతు మనం ఇవ్వాలనే అభిప్రాయం ప్రతివారికీ కలగాలి.

నా దేశస్వాతంత్ర్యంకోసం, నా స్వేచ్ఛను రక్షించుకోవడంకోసం, నేను చెయ్యగలిగింది నేను చేస్తాను అని ప్రతి పౌరుడూ దీక్షపూనాలి. ఇలాంటి దీక్షపూనిన వ్యక్తి, తాను రక్షణనిధికి ఇచ్చే డబ్బును విరాళం అనుకోడు. తన అవసరాలను కూడా కొన్నిటిని వదులుకొని, ఇవ్వగలిగిన దానికంటె ఎక్కువ డబ్బును, చెయ్యగలిగిన దానికంటె ఎక్కువ సేవను మాతృదేశపు పాదాలకు అర్పిస్తాడు.

ఈనాటి పరిస్థితులలో మనం మనకూ, దేశానికీ చెయ్యవలసిన సేవ రక్షణనిధికి ఏదో కొంత డబ్బును ఇవ్వడంతో సరిపోదు.

రక్షణ కార్యకలాపాలు భారీఎత్తున జరగడానికి అన్నివిధాలా మనం తోడ్పడాలి. ప్రతి పౌరుడూ, సుశిక్షితుడైన సైనికునిలాగ ప్రవర్తించాలి.






బంగారం !' మంచితనానికీ, విలవకూ పెట్టింది పేరు ! "బంగారంలాటి మనిషి" అంటాం. "బంగారంవంటి సంబంధం" అంటాం. నిజానికది లోహాలన్నిటిలో ఖరీదైనదికాదు — అంతకన్న ఖరీదైన లోహాలు అనేకం ఉన్నాయి; కాని ఒక్కటి కూడా "సాంస్కృతికంగా" దాని స్థానాన్ని ఆక్రమించలేకపోయాయి.

ఈ బంగారం ఏనాటిది ? మనుషులు దీన్ని ఎప్పుడు కనిపెట్టారు ? ఎవరూ చెప్పలేరు. బ్రిటిషువాళ్ళూ, ఇతర పాశ్చాత్యులూ ఇండియాకు వచ్చేనాటికే మనదేశంలో ఎక్కడబడితే అక్కడ బంగారం ఉండేది. ఇంకా అంతకు మునుపు అరబ్బీఖలీఫాలకాలంలో బంగారం కొండల ప్రమాణంలోనూ, గుట్టల ప్రమాణంలోనూ ఉండేదిట. ఛెంఘిజ్ ఖాన్ కాలంలో కూడా అతని కోటల్లో బంగారం మూలుగుతూండేదిట. మన పురాణాలనిండా బంగారం ఉంది. లంకా నగరం నిండా బంగారు మేడలు. బృహస్పతి ఇంద్రుడికి యాగ్లీనుడుగా కుదిరేనాటికి భూలోకంలో కొలవటానికి వీలులేనంత బంగారం ఉండేది.

మానవుడు బంగారం ఎరగని కాలంలేదు, యుగంలేదు, దేశంలేదు. గ్రీకులూ, ట్రోజనులూ పోట్లాడేటప్పుడు కొందరు బంగారు కత్తులు ఉపయోగించారు. భారతంలో బంగారు శాస్త్రాలున్నాయి. నాగరిక ప్రపంచం మాట అటుంచుదాం. అనాగరిక ఆటవిక జాతులకు కూడా బంగారం ఉండేది. వాళ్లు బంగారు కణికలకు బెజ్జాలుచేసి, తాళ్లు దూర్చి

మెడల్లో వేసుకునేవారట. ప్రపంచమంతటా నాగరికతను విస్తరింపజేసిన తొలి పాశ్చాత్యులు ఆ ఆటవికులకు చక్కెర బిళ్లలూ అవీ ఇచ్చి బంగారం పుచ్చేసుకున్నారని ప్రతీతి.

నన్నడిగితే నాగరికతవల్ల బంగారానికి న్యాయం జరగలేదు. అన్యాయమే జరిగింది. బంగారుతొడుగులు వేసుకోవటం అనాగరికతగా పరిణమించింది. ఈనాడు మన దేశంలోనే బంగారు ఒడ్డాణాలూ, కాసుల పట్టెడలూ తగని మోటు! ఆధునిక నాగరికులు బంగారాన్ని నాణాలకు ఉపయోగించ సాగారు; అదే దాని ముఖ్య ప్రయోజనంగా పరిణమించింది. రానురాను అది కూడా పోయింది. బంగారు సవర్లూ, బంగారు డాలర్లూ, బంగారు రూబుళ్ళూ, బంగారు మాయిడోర్లూ మొదలైన నాణాలు పోయి కరెన్సీ వచ్చేసింది. ఈనాడు బంగారం యొక్క ప్రయోజనమేమంటే — ప్రభుత్వాల నిర్బంధంలో ఉండటం.

మన దేశంలో నాగరికత అంతగా లేని కారణంచేత మామూలు సంసారుల దగ్గిర కూడా నగల రూపంలో బంగారం ఉండే అవకాశం ఉంటూ వచ్చింది. కాని దానిక్కూడా ఇప్పుడు ఎసరు వచ్చేసింది. అందరి దగ్గిరా అంతో ఇంతో బంగారం ఉండటంచేతనే మన దేశంలో బంగారం ధర ఉండవలసినదాని కన్న రెట్టింపుకు పైగా ఉందట. అందుకే ఇతర దేశాలనుంచి అంతులేని బంగారం దొంగరవాణా అవుతోందట. రకరకాల బ్లాక్ సొమ్ము సంపాదించేవారు తమ డబ్బును మరేరూపంలోకీ మార్చలేక దొరికినంత బంగారం అయినకాడికి కొని పాతర్లు వేసేస్తున్నారుట.

ఇందుకుగాను ఇండియా ప్రభుత్వం ఎక్కడెక్కడి బంగారాన్నీ బయట పెట్టేటందుకు పథకంవేసింది. ఆ పథకమే బంగారం బాండ్లు. సవరు 41 రూపాయిచేసి బంగారం తీసుకుని ప్రభుత్వం బాండ్లు ఇస్తుంది.

వాటిమీద చక్రవడ్డీ బాగా ఇస్తుంది. బంగారం తెచ్చి ఇచ్చిన వాణ్ణి, "ఇది నీ కెలా వచ్చింది ?" అని అడగదు. అంటే బ్లాక్ మనీ మంచి డబ్బవుతుంది. నూరు పెట్టిన సవరుకు 40 రూపాయిలే వస్తే ఏంగాక ? న్యాయంగా రాబడి పన్ను ఇచ్చుకుంటే నూరింట ఏ ఎనభయ్యో పన్ను కిందే పోయిఉండునేమో ! పై పెచ్చు నూటికి ఆరున్నర వడ్డీ.

మన దేశంలో ప్రభుత్వం నాగరికత ప్రవేశ పెట్టటానికి వేసిన ఈ పథకం విజయవంతమయినదీ లేనిదీ అప్పుడే తెలియదు. మొదట్లో బంగారం బాండ్లు అంతగా అమ్మలేదన్నారు. బంగారం ధర మాత్రం పడిపోయింది – కొద్దిగా; అంతర్జాతీయ ధర కింకాపడలేదు. పడుతుందో లేదో తెలీదు.

ఇది కూడా గుడ్డిలో మెల్ల అనుకోవాలి. ఎందుకంటే బంగారం దొంగ రవాణా లింకా సాగుతూనే ఉన్నాయి. ప్రభుత్వానికి లక్షలు లక్షలు ఖరీదుచేసే బంగారం చిక్కుతూనే ఉంది. బంగారం ధర పూర్తిగా పడిపోతే బంగారం దొంగరవాణాలు నిలిచిపోతాయి. కాని బంగారం ధర అంతర్జాతీయ ప్రమాణానికి దిగనంతకాలమూ "అండర్ గ్రౌండ్" చేరిన బంగారం పైకిరాదు. బంగారంలేని ప్రభుత్వం పేద ప్రభుత్వమే. అంతర్జాతీయ వ్యాపారంలో తగులు మిగుళ్లు సరిచేయా లంటే ప్రభుత్వం దగ్గిర బంగారం ఉండాలి. ఇప్పట్లో మనకు మిగులు ఎగుమతులు సాధ్యంకాని కారణంచేత ప్రభుత్వానికి బంగారం చాలా అవసరం. దేశం నిండా బంగారం ఉండి ప్రభుత్వం దగ్గిర లేకపోవటం ఆధునిక నాగరికతకాదు.

కనీసం నాగరికతకోసమైనా మనం బంగారాన్ని ఒంటిపైన పెట్టు కునే అలవాటూ, భూస్థాపన చేసే అలవాటూ మానుకోవాలి. పాశ్చాత్యదేశాలవాళ్లు అలంకారార్థం మాత్రమే నగలు పెట్టుకుంటారు.

అది కూడా కల్తీ బంగారం. వాళ్ల నగలలో ఉండే బంగారం ఖరీదుకన్న మజూరీ చార్జీలు హెచ్చుట. అందరూ నకిలీ బంగారం నగలే పెట్టుకుంటే నవ్వేవారుండరు. అదీగాక నడిచే నగల దుకాణాల్లాటి ఆడవాళ్లు ఉండకుండా పోతారు. అందరమూ బంగారాన్ని ప్రభుత్వానికిచ్చేసి సొమ్ము పుచ్చుకుంటే దేశంలో డబ్బు జాస్తవుతుంది. బాంకుల్లో సొబ్బెక్కువవుతుంది. ఇది ప్రభుత్వానికీ, ప్రజలకూ కూడా మంచి ఏర్పాటు.

ఈ నాగరికతతో ఒకటే చిక్కు - గొంతుమీదికి వచ్చినప్పుడు పెళ్లాం పుస్తెలు తాకట్టు పెట్టటానికి గాని, ఉద్యోగం ఇచ్చేవాళ్లు ఇంటర్వ్యూకి రమ్మంటే రైలుచార్జీకోసం చేతి ఉంగరం అమ్మటానికి గాని, పెళ్ళిళ్ళప్పుడు పిల్ల కెన్నితులాల బంగారం పెడతారని నిలవదీసి అడగటానికిగాని ఉండదు. బానిసగా అమ్ముడైన చంద్రమతి మెడలో విలువైన ఆ మంగళసూత్రమే లేకపోతే ఆమె తన భర్త అయిన హరిశ్చంద్రుణ్ణి తెలుసుకుని ఉండదు !

అదీగాక బంగారమంటే లక్ష్మి అన్న నమ్మకం మన దేశంలో ఆనవాయితీగా వస్తున్నది. ఎంత పేదవాళ్ళ దగ్గరైనా చిన్నమో, అరచిన్నమో బంగారం ఉండటం రివాజు. ఎంత కొద్దిబంగారమైనా లక్ష్మే కద ! ఈ సంగతి గుర్తించే మొరార్జీ దేశాయిగారు కొద్దిపాటి బంగారం — లక్ష్మి — ఎవరి దగ్గరైనా ఉండవచ్చు నన్నారు. ఇది మంచి ఏర్పాటు. ధనిక దేశాలవాళ్లు మనని పేదదేశమని హేళన చెయ్యటానికి ఉండదు; "మా దేశంలో ప్రతి ఒక్కడికీ లక్ష్మీకటాక్షం ఉంది," అని మనం జవాబివ్వవచ్చు.

డబ్బు పుష్కలంగా ఉండి, దాంతో ఏంచెయ్యాలో తెలీక, ప్రభుత్వ బాండ్లూ అవీ కొనటం ఇష్టంలేక బంగారం కొని భార్యలకు తగిలించిన వారు అప్పట్లో ఏమనుకున్నారంటే "ఈ బంగారం ధర ఇలా పెరుగు

తూనే ఉంటుంది. దీనికి మరి తరుగంటూ ఉండదు అను కున్నారు. దేశాయిగారు చక్రం అడ్డేసేదాకా బంగారం ధర ఏ చక్రవడ్డీకీ అంద కుండా పెరిగినమాట నిజం. బంగారం ధర అంతర్జాతీయ విలవకి పడి పోయినాక ఈ బంగారం వేలంవెర్రి తగ్గుతుంది. అప్పుడు డబ్బెక్కువ ఉన్నవారు బంగారం కొనటం మానేసి స్థలాలో ఏదో కొంటూరు. దాంతోబాటే ఆడవాళ్లు బంగారుతొడుగులు ధరించే ఫాషను వెనక పడితుపోంది.

ఎటొచ్చీ భూ స్థాపితమైన లక్ష్మినే కదిలించటం కష్టం. ఇరవైఒకటో శతాబ్దపు భారతీయ ఖలీఫాలు చాలామంది ఉండి ఉంటారు. అయితే వారు తమ బంగారాన్ని బహిరంగంగా ప్రదర్శించలేరు. పెళ్ళాం పురుడుకో, పెద్దబ్బాయి పరీక్షకో, చిన్నవాడి ఉద్యోగం ఇంటర్వ్యూ కోసం రైలు చార్జీలకో, వేళగానివేళ ఇంటిపన్ను వచ్చి మీద పడటం చేతనో, ఉన్నట్టుండి ఇంటిల్లిపాదికీ రోగాలువచ్చి డాక్టరు బిల్లులూ, మందుల ఖర్చూ దాపరించటంవల్లనో కొంత బంగారం అమ్ముకోవలిసిన పరిస్థితి వారికి ఏర్పడదు. ఆ బంగారం అలా ఖైదులో ఉండి పోవలసిందే.

వెనకటికొక లోభి అంతులేని బంగారం ఒకచోట రహస్యంగా పాతి పెట్టి, అప్పుడప్పుడూ వెళ్ళి రహస్యంగా చూసుకుంటూ ఉండేవాట్ట. ఏ పాతిక సంవత్సరాలో అలా ఖైదులో ఉండి ఆ లక్ష్మి కాస్తా అంతర్ధాన మయింది. లోభివాడు పొర్లిగింతలు పెట్టి ఏడుస్తూంటే, ఎవరో వచ్చి సముదాయించారుట : "నువ్వా బంగారాన్ని అమ్మబోవటంలేదుగద ? దానితో నీకేమీపనిలేదుగద? అక్కడే ఉందనుకో! దేనికేడుస్తావు?"అని.

ఇలా నిరుపయోగంగా ఖైదులో ఉన్న బంగారాన్ని పైకి లాగ గలిగితే మొరార్జీగారు గిరీశం అన్నట్టు పూరా ప్రయోజకుడే. చూద్దాం, పంజరుగుతుందో !





"తలక్కూడా కొంచెం బ్రష్ వెయ్యమంటారా?"



*(గతసంచిక తరువాయి)*

పాతిక సంవత్సరాల వయస్సు కలిగిన మహితోషుడి ప్రేమకు, నలభై ఐదు సంవత్సరాల వయస్సులో వున్న మేజర్ సన్యాల్ ప్రేమకు సామ్యం ఏమైనా వున్నదేమోనని ఇరా ఆలోచిస్తూ కూర్చుంది. మహితోషుడు ఆమె యౌవ్వనాన్ని పొందడానికి ప్రయత్నించాడు; మేజర్ తన వాత్సల్యాన్ని ప్రదర్శించి సంతృప్తి చెందడానికి సంకల్పించుకున్నాడు. మహితోషుడు ఆమెను తన అంకంలో ఇముడ్చుకొని తుఫానువేగంతో ఆకాశం మీదికి ఎగిరిపోవాలనుకున్నాడు. మేజర్ ఈ భూమిమీదనే ఆమెతో సుఖంగా కాలం గడపాలనుకున్నాడు మహితోషుడు ఏ మాలోచించాడో ఏమో ? శారీరిక వాంఛ అనేదీ ప్రేమకు ఆధారం కాగలదా ?

# 6

వేసవికాలంలో మసూరీలో చాలా హడావిడిగా వుంటుంది. ఈ సంవత్సరం కూడా అలాగేవుంది. అన్ని రకాలైన వ్యక్తులు అక్కడికి వచ్చిచేరతారు — శారీరిక వ్యాధిగ్రస్థులు; మానసిక వ్యథాగ్రస్థులు ! మహితోషుడు వుద్యోగానికి వుద్వాసంచెప్పి తిన్నగా కలకత్తా వెళ్ళిపోలేదు; మసూరీ చేరుకున్నాడు. 'హేక్‌మన్స్' లేదా 'సెవోయ్' హోటల్లో దిగితే పరిచితవ్యక్తులు కన్పించే ప్రమాదంవుండవచ్చునని 'షార్లవిల్ హోటల్'లో బసచేశాడు.

ఆరోజు ఇరా అన్నమాటలు మహితోషుడికి ఎంతో అవమానకరంగా తోచినాయి. ఆ మాటలకు అతని మనస్సు ఎంతగానో వ్యధచెందింది. ఆ బాధను అతను సహించలేక పోయాడు. మహితోషుడు బాల్యంలోనే తల్లిని పోగొట్టుకున్నాడు. మేనత్త పెంచి పెద్దవాణ్ణి చేసింది. మాతృప్రేమ అంటే ఎలావుంటుందో తెలియని అతని మనస్సు నిత్యం ప్రేమకోసం, వాత్సల్యం కోసం పరితపిస్తూ వుంటుంది. వివాహితురాలైన ఇరాను ప్రేమించే అధికారం తనకు లేదని అతనికి తెలుసు. ఆరోజున సంభవించిన సంఘటనకు, మానసిక దౌర్బల్యానికి అతను ఎంతగానో సిగ్గుపడ్డాడు కూడాను !

లైబ్రరీకి ఎదురుగావున్న మాల్‌రోడ్డు చివరమూలన ఆలోచిస్తూ కూర్చున్న మహితోషుకు అగస్మాత్తుగా 'ఏమండోయ్ !' అనే పిలుపు విన్పించింది.

ఉలిక్కిపడి వెనక్కి తిరిగి చూశాడు. ఎదురుగా ఒక అందాలభరిణె నిలబడి వున్నది — ఎర్రటి శరీరం, గాంభీర్యాన్ని ప్రదర్శించే చిన్నచిన్నకళ్ళూ. వంగపండు రంగు జార్జెట్ చీరె, కాళ్ళకు ప్లాట్‌ఫారం షూ, వంటిమీద తెలికరంగు ఓవర్‌కోటూ, తీర్చిదిద్దిన అవయవ సౌష్ఠవం !

మహితోషుకు ఆశ్చర్యంవేసింది. తననుతాను సంబాళించుకొని — "ఆఁ ! ఏమిటండీ ?' అని అన్నాడు.

"నాకొక సహాయం చేసిపెడతారా ?"అని అడిగింది ఆ యువతి, అత్యంత కోమల స్వరంతో ! ఆ స్వరంలో నదురూ, బెదురూ అనేది లేనేలేదు.

మహితోషుకు కొంచెం సంకోచం వేసింది. ఈ యువతి విచిత్ర ప్రవర్తనకు విస్మితుడై, అలాగే అన్యమనస్కుడై, నిలబడిపోయాడు.

"చూడండి ! మీకు శ్రమ కల్పించడం నా కిష్టం లేదనుకోండి. అసలు విషయమేమిటంటే — 'బేకరీహిల్' మీద మేమొక కాటేజ్ తీసుకున్నాం. షికారుగా ఇందాకా

వచ్చేప్పటికి సాయంత్ర మైంది. 'బేకరీహిల్'కు వెళ్ళాలంటే – దారి నిర్జనంగా వుంటుంది. మీరు కొంచెం సజ్జనులుగా కన్పిస్తున్నారు; కొంచెం దూరందాకా వచ్చి నన్ను పంపిస్తారా? అధికార పూర్వకంగా కాదు, వినయ పూర్వకంగా అడుగుతున్నాను." అని ఆమె వినయం ఉట్టిపడేలా అడిగింది.

"నేను సజ్జనుడినని మీకెలా తెలుసునండి? నేను దుర్జనుణ్ణి కావచ్చు: దొంగను కావచ్చు; ఇక్కడికొచ్చి అజ్ఞాతంగా వుంటున్నానేమో? మీరెలా చెప్పగలరు?" అని మహితోషు నవ్వుతూ అన్నాడు.

"కావచ్చు; కాని అజ్ఞాతంలోఉండే చోరులు సంధ్యాసమయాన ఇలా తీరికగా కూర్చొని ప్రకృతి సౌందర్యాన్ని అవలోకిస్తూ ఆనందాన్ని అనుభవిస్తూ కాలంగడుపుతారటండీ? పైగా 'షార్లవిల్' వంటి గొప్ప హోటల్‌లో వుండగలిగిన వ్యక్తిని దొంగంటే పరువునష్టం దావా వేయవచ్చు...ఇంతకూ మీరు కొంచెందూరంవరకు పంపిస్తే సరేసరి; లేకపోతే నేనే వెళ్ళిపోతాను; అయితే ఏదైనా అప్రియమైన సంఘటన సంభవిస్తే మటుకు దానికి బాధ్యత మీరే వహించ వలసి వుంటుంది. గుర్తుంచుకోండి!" అన్నది నవ్వుతూ ఆ యువతి!

మహితోషుడు చిరునవ్వు నవ్వుతూ ఆమెవెంట నడిచాడు. కొంతదూరం వరకు ఉభయులూ మౌనంగానే వున్నారు. ఇంతలో హాక్‌మన్‌హోటల్ సమీపించింది. "ఏమండోయ్! మీరిలా మాటా పలుకూలేకుండా నడిస్తే ఎలా చెప్పండి? నోరు కట్టేసుకోడం నాకు చేతకాదండోయ్!...ఏమైనా కబుర్లు చెప్పండి." అని అన్నది ఆ తరుణి!

మహితోషుడు మారు మాట్లాడలేదు,

"మీరు చాలా అరసికులుగా కన్పిస్తున్నారే!" అని అన్నది ఆయువతి,

"కావచ్చు. సరేగాని...ఇంతకూ మీ పేరేమిటో, ఏ వూరో ఎక్కడ ఉంటున్నారో ఏమిటో చెప్పనేలేదు. అర్థంలేని మాటలు మాత్రం చాలా అనేశారు. కనీసం నా పరిచయంకూడా మీరు అపేక్షించలేదు" అన్నాడు మహితోషుడు.

"ఓహో! మీకు మాట్లాడడం వచ్చునే!" అని ఆ యువతి ఆశ్చర్యాన్ని ప్రకటించింది.

"ఏమిటంత ఆశ్చర్యపోతున్నారు? నేను మనిషిని కాదనుకున్నారా?"

"నేను దేవదూత అనుకున్నాను. శాపం వలన మర్త్యలోకంలోకి వచ్చారేమో నని భావించాను."

మహితోషుకు నవ్వు ఆగిందికాదు.

"ఈ కబుర్లు కేమొచ్చెగాని – నేను అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పండి."

"నాపేరు : రేఖ : నివాసం : కలకత్తా. ప్రస్తుతం : 'న్యూ హెవెన్', బేకరీ హిల్‌లో మకాం. ఇక చెప్పండి, మీ రెప్పుడొచ్చారు యిక్కడికి ?"

"ఈమధ్యనే వచ్చాను."

"మరి మీరు మీ పరిచయం యివ్వండి."

"నేను షార్ల్‌విల్ హోటల్‌లో వుంటున్నానని మీ కెలా తెలుసో ముందు కొంచెం చెప్పండి ?"

"చెప్పకపోతే ఏం జేస్తారు ?"

"సరే, చెప్పకండి !"

మరల ఉభయులు మౌనంగా నడుస్తున్నారు.

చలి విపరీతంగా వున్నది. ఆ క్రిందటిరోజే బాగా వర్షంకూడా కురిసింది. బజారు వచ్చేసింది.

"ఇక మీరు వెళ్ళ వచ్చు ! వెళ్ళడానికి ముందు మిమ్మల్ని గురించి చెబితే – ఇంటికి వెళ్ళి ఒక విచిత్రమైన వ్యక్తితో పరిచయ మైందని చెబుతాను. బహుశా మా అన్నయ్య ఇప్పటికే గాభరా పడుతూ వుంటాడు. ఆయనతో చెబుతాను – ఒక సహృదయ వ్యక్తి నన్ను యిక్కడిదాకా పంపించారని: మీ మంచి తనాన్ని గురించి నాలుగు మాటలు యెక్కువగానే చెబుతా లెండి !" అని అన్నది రేఖ.

ఇంత ధైర్యంగా, ఇంత చనువుగా మాట్లాడగలిగే యువతిని మహితోషుడు యిదివరలో యెన్నడూ చూడలేదు. అతనికి కొంచెం ఆశ్చర్యం వేసింది. ఆ తరువాత అతనేమి ఆలోచించుకున్నాడో యేమో మారుమాట్లాడకుండా వెనక్కు తిరిగి వచ్చాడు.

## 7

"ఎక్కడికెళ్ళా వమ్మా ఒంటరిగా ? రాత్రి ఎనిమిది గంటలైనా రాలేదేమని మేం చాలా గాభరాపడ్డాం." అన్నాడు మేజర్‌సన్యాల్, తన చెల్లెలు రేఖ ఇంట్లో అడుగు పెట్టడంతోనే !

"ఎందు కన్నయ్యా అంతభయం ? నే నేమైనా చిన్నదాన్నా చితకదాన్నా ? మసూరీ నేను మొదటిసారిగా వచ్చినమాట నిజమేననుకో ! ఇక్కడ రోడ్లు ఇంత వంకర టింకరగా ఉంటాయేమిటి ? మాల్ రోడ్డు మాత్రం తిన్నగా వుంటుంది. బేకరీ హిల్‌నుంచి లైబ్రరీ, లైబ్రరీ నుంచి బేకరీహిల్ : నేను ఈ మధ్యనే ప్రయాణం చేశాను.



"నాన్నా ! ఇవాళ మా పంతులుగారి గొప్ప తేలిపోయింది.?
నాకు చదువు చెప్పటం తనవల్లకాదని తేల్చి చెప్పాడు.''

అయినా ఒక పెద్దమనిషిని ఇక్కడదాకా పంపించి వెళ్ళ వలసిందని కోరాను, ఆయన వచ్చి నన్ను యిక్కడదాకా పంపించి మరీ వెళ్ళాడు.'' అన్నది రేఖ !

''ఆ వచ్చిన పెద్దమనిషి యువకుడా, వృద్ధుడా ?'' అని ఇరా అడిగింది, మేజర్ సన్యాల్ ఏదో అడగడానికి ప్రయత్నించే లోపలే !

రేఖ ఇరా చెవివద్దకు నోరు తీసుకెళ్ళి—'యువకుడే!'అని నెమ్మదిగా చెప్పి మేజర్ సన్యాల్‌తో — ''వట్టి పిచ్చివాడు మాదిరిగా కన్పించా డన్నయ్యా !'' అని అన్నది.

మేజర్ సన్యాల్ ఆశ్చర్యాన్ని అభినయిస్తూ — "అయితే చచ్చాం ! నీకామాత్రం—మనిషి మంచివాడో, పిచ్చివాడో తెలుసుకునేంత తెలివిలేకపోయిందా ? పిచ్చిగా ప్రవర్తించివుంటే ఏమయి వుండేది ?" అని అన్నాడు.

"అబ్బే ! అటువంటి పిచ్చివాడు కాదు !"

ఇరా, మేజర్ ఇద్దరూ ఒక్కసారిగా బిగ్గరగానవ్వారు.

''అయితే ఎటువంటి పిచ్చివాడంటావు ?"

మాటా పలుకు లేకుండా నడిచివచ్చాడు, నా వెంట ! పేరూ, వూరూ అడిగినా చెప్పలేదు."

"చూడ్డానికి ఎలా ఉన్నాడు ?"

"చాలా నల్లగా భూతంలాగా వున్నాడు !'' అని అన్నది రేఖ చిలిపిగా !

మేజర్ సన్యాల్ నవ్వాడు.

"ఆ నల్లటి భూతంతో నీ పెళ్ళి చేసివేస్తాం. లేకపోతే ఇప్పటిదాకా మమ్మల్ని విచారంలో వుంచావు."

"ఆఁ ఈ శిక్ష విధించవలసిందే !'' అన్నది, రేఖ కొంటెగా నవ్వుతూ !

ఆ రెండవరోజు మేజర్ సన్యాల్, ఇరా ఏదో డిన్నర్‌కు వెళ్ళారు. రేఖనుకూడా ఆహ్వానించారు.కాని ఆమె వెళ్ళలేదు.నౌకరు అభిమన్యుణ్ణి వెంటబెట్టుకొని మాల్ రోడ్డు వైపు షికారుగా వెళ్ళింది. లైబ్రరీ వద్దకు వచ్చేప్పటికి చీకటిపడింది. రేఖ అటూ ఇటూ దృష్టిసారించి చూసింది. క్రిందటరోజు కూర్చున్నచోట ఆ యువకుడు ఆమెకు కన్పించలేదు. అతడు అక్కడ వుంటాడేమోనని ఆమె అనుకున్నది. అతను కన్పిస్తే తాను మాట్లాడననికూడా నిర్ణయించుకున్నది. ఆ తరువాత ఆలోచించలేదు— అతగాడే తనను బ్రతిమలాడుకుంటాడో, లేక తానే అతనితో మాట్లాడుతుందో ! ఇప్పుడు ప్రశ్నే లేదు ; అతగాడు అక్కడలేడు. రేఖ కొంచెంసేపటివరకు అక్కడే నిలబడింది.

"అమ్మగారూ ! చీకటిపడింది ; ఇంటికి వెడదాం పదండి. చాలాదూరం వెళ్లాలి" అని అన్నాడు నౌకరు అభిమన్యు !

"నీవు వెళ్ళవోయ్ ! నేనొక్కర్తెనే వస్తాలే." అన్నది రేఖ కొంచెం కోపంగా ! అభిమన్యుడు చాలా నమ్మకస్తుడైనవాడు ; పైగా చాలాకాలంనుంచి వాళ్ళదగ్గర పని చేస్తున్నాడు. రేఖను చిన్నప్పుడు ఎత్తుకొని పెంచాడు. అతడు కొండజాతికి చెందిన వాడు. రేఖకు కోపంవచ్చేటప్పటికి అతగాడేమీ మాట్లాడలేదు. అక్కడే ఏదో దుకాణంవుంటే — అక్కడికివెళ్ళి ఏవోవస్తువులు చూస్తూ నిలబడ్డాడు.

సరీగ్గా యిదే సమయానికి మహితోషుడు వెనుకనుంచివచ్చి — "ఏమండోయ్ ! మీ నౌకరుని వెళ్ళమని చెప్పండి. మీ ఇంటిదాకా నేను పంపిస్తాలెండి." అని అన్నాడు.

రేఖ వెనక్కు తిరిగిచూసి — "ఓహో ! తమరా ?'' అని అన్నది.

"అవును నేనే ! యివ్వాళకూడా మీరిటువైపు వస్తారని నేను వూహించలేదు. మీరు నన్ను వెంబడించలేదుగదా ?"

"ఏమిటి ? ఎందుకొచ్చింది మీ కీసందేహం ?"

"పోనిద్దురూ !...నిన్న బహుశా మీరు బాగా తిట్లుతినేవుంటారు !"

"మా అన్నయ్య కొంచెం గాభరాపడ్డాడు. ఇక మా వదినె వున్నదంటే – ఆమె అతినిర్వికారంగా కూర్చుని ఉన్నది. అయినా, నేను పాలుతాగే పసిపిల్లనటండీ, గాభరాపడడానికి ? నా బరువెంతో తెలుసా ?"

మహితోషుడునవ్వి – "ఎత్తుకొని చూడమంటారా ఏమిటి ?" అని – "బాబోయ్ అంగరక్షకుడుగా నౌ క రు ఉన్నాడు కాబోలు ! ఆడపిల్లను ఎత్తుకుపోతున్నానని భ్రమపడి – నా వీపు చిట్లకొచ్చునేమో !" అని మళ్ళీ అన్నాడు.

రేఖ నవ్వి–"ఈనాటి యువకులు కబుర్లయితే చెబుతారుగాని, ధైర్యంగా ఏ పనీ చేయలేరు'' అని అన్నది.

"మొత్తానికి మీరు కబుర్లు చెప్పడంలో మహా దిట్టగా కన్పిస్తున్నారు. ఏ కాలేజీలో చదువుతున్నారండీ ?"

"బేథున్‌లో నండీ !"

"అలా చెప్పంటి ! అందుకే మీకింత గర్వం ! బేథున్‌లో ఆడపిల్లలు చాలా చలాకీగా, అతి నిక్కుగా వుంటారట. నిజమేనటండీ ?''

"మీరు పొరపాటు విన్నారు ! బేథున్ పట్నానికి చెందిన ఆడపిల్లలు చాలా వినయ, విధేయతలు కలిగివుంటారు."

మహితోషు బిగ్గరగా నవ్వాడు. రేఖకూడా నవ్వింది.

కొంచెంసేపు గడిచాక రేఖ కొంచెం సందేహిస్తూ – "ఏమండీ ! హోటల్‌లో మీ రూం నంబరు ఎంతండీ ?" అని అడిగింది.

"పన్నెండు."

"ఇక్కడ మీ రెన్నిరోజులుంటారు ?"

"చెప్పలేను ! ఉంటే మరికొన్ని రోజులుండవచ్చు ! వెళ్తే రేపే వెళ్ళిపోవచ్చు !"

"మీ పేరేమిటో ఇంతవరకు చెప్పనేలేదు ?''

"ఏమిటి దానివల్ల ఒరిగేది ?"

"మీరు మా యింటికి రాకూడదూ ? మా అన్నయ్యకూ, వదినెకూ మిమ్మ పరిచయం చేస్తాను."

"మీ అన్నయ్య ఏం చేస్తుంటారు ?"

"ఆయన మిలటరీలో డాక్టరుగా పనిచేస్తున్నారు. రావల్పిండిలో వున్నారు."

"ఆయన పేరేమిటండీ ?" ఆదుర్దాగా అడిగాడు మహితోషు.

"ఆఁ పేరు చెబితే ఒరిగేదేమిటి లెండి ?'

"ప్లీజ్ చెప్పండి ! నే నెరుగుదునేమో ? అందుకని అడుగుతున్నాను."

"మేజర్ సన్యాల్ !"

మహితోషు ఒక్కసారిగా ఉలిక్కి పడ్డాడు. ఎందుకో ఆమె మాటలునిజం కాదేమో నని భ్రమపడ్డాడు. నిర్ధారణ చేసుకోవాలనే ఉద్దేశ్యంతో —"మీ వదినె పేరేమిటండీ?" అని అడిగాడు.

"మా వదినె పేరా ? ఆమె పేరు మీకెందుకుకండీ ?"

"చెప్పండి ! ప్లీజ్ !"

"ఇరా సన్యాల్ !"

మహితోషుకు ఆ మాటలు విన్పించనే లేదు. రేఖ మాట్లాడడానికి ముందే ఆ పేరు అతని చెవుల్లో మార్మోగింది.

## 8

ఆరోజు రాత్రి మహితోషుకు నిద్రపట్టలేదు. ఎవరినుంచి పారిపోయి మసూరీ వచ్చాడో, ఆ వ్యక్తే మరల ఇక్కడ తటస్థపడుతుందని స్వప్నంలోకూడా అతను వూహించలేక పోయాడు. యావత్తు మసూరీ సౌందర్యం, ఉత్సాహంతో నిండిన వాతావరణం అగస్మాత్తుగా నీరసంగా, విషతుల్యంగా మారిపోయింది. షార్లవిల్ హోటల్‌లో అత్యంత మనోహరంగా అలంకరించబడిన అతని గదిలోని ప్రతివస్తువు అతన్ని భయపెడుతున్నది. ప్రతివస్తువు భయంకరంగా, వికృతంగా కన్పిస్తున్నది. ఈ పరిస్థితిలో అక్కడెలా వుండడం ? రెండో రోజే మసూరీ వదలి వెళ్ళడానికి అతను నిర్ణయించుకున్నాడు.

ఎలాగో ప్రాతఃకాలమైంది. గడియారంవైపు చూసుకున్నాడు. ఆరుగంటలే అయింది. ఏడుగంటలయితేగాని బయటికి బయలుదేరటానికి వీలుండదు. ఆ ఒక్క గంట గడపడం అతనికి ఏంతో బాధాకరంగా తోచింది.

ఆ తరువాత ఏం జరిగిందో ఏమిటో అతనికి తెలియదు; అయితే ఆరోజే అతను మసూరీవదలి వెళ్ళిపోయాడు.

ఆ రోజు సాయంత్రం.

"వదినా ! లైబ్రరీదాకా షికారుకు వెడదాం ! వస్తావా ?" అని రేఖ ఇరాను అడిగింది.



"చెప్పు లీలా ! నీవు ఇతరులు చూడకుండా ఎవరిజేబులోనించైనా డబ్బుతీస్తే నిన్ను ఏమంటారూ ?''
"చెప్పేందుకు నాకు సిగ్గుగావుందండీ, నన్ను వారి భార్య అంటారు !"

---

''నేను వస్తే బావుంటుందా ?" అని ఇరా అన్నది – ''నీ వొక్కర్తెవే వెడితే బావుంటుంది, అతగాడు కన్పిస్తే మనింటికి తీసుకరావచ్చు !''

"నా కింకేమీ పనిలేదనుకున్నా వేమిటి వదినా ? అతగాడు దర్శించుకోవలసినంత ఆకర్షవంతమైన యువకుడేమీకాదు. ఏమిటో పోగొట్టుకున్నవ్యక్తి మాదిరిగా కన్పిస్తాడు. పైగా...''

''అలావుండడం మామూలే ! ప్రేమోన్మాదంలో చిక్కుకున్న వాళ్ళెప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్టు సంచరించడం కొత్తవిషయమేమీకాదు !...సరే, నేనుకూడా వస్తాను, వెడదాంపద : మీ అన్నయ్య నీ పెళ్ళికోసం తొందరపడుతున్నారు కూడాను."

"నా పెళ్ళి విషయంలో ఇంత తాపత్రయ పడవలసిన అవసరమేమీ లేదు. వదినా ! అలా వూరికే షికారుగా వెడదాం. వస్తే రా, లేకపోతే లేదు. అన్నయ్యనుకూడా రమ్మను.''

"పెళ్ళి విషయంలో నీకు తొందరలేకపోతే మేంవచ్చి లాభమేమిటి ? నీవే వెళ్ళు !'' అని ఇరా నవ్వుతూ అన్నది.

"వదినా ! ఏమిటీ ఆలస్యం ! బయలుదేరు ! మసూరీవచ్చి వారంరోజులైంది; నీ వెప్పుడైనా షికారుకు బయలుదేరావా ? ఆ పార్టీఅని, ఈ పార్టీఅని పరుగెత్తడం తోనే సరిపోయింది. ఇవ్వాళ మిమ్మల్నివదిలి నేనొక అడుగుకూడా న గచ్ఛామి !"

"సరే, పద వెడదాం ! అ(...మీ అన్నయ్యతోకూడా చెప్పివస్తాను.''

ఉభయులూ లైబ్రరీదాకా నడిచి వచ్చారు.

"ఏమమ్మా ! నీ హృదయవల్లభుడు కూర్చునేది యెక్కడ ? ఆ మహానుభావుణ్ణి నేను కూడా చూసి కాస్త సంతోషిస్తాను" అని ఇరా అడిగింది రేఖను.

రేఖ మొహం ఒక్కసారిగా ఎర్రబడిపోయింది.

మేజరు సన్యాల్‌కు ఏమీ అర్థం కాలేదు.

"ఏమిటి విషయం ?" అని ప్రశ్నించాడు.

''మీ చెల్లెలు ఆ రోజు ఒక సహృదయుడైన యువకుణ్ణి గురించి చెప్పలేదూ ? ఆయన యిక్కడే కూర్చుంటాడట !'' అని ఇరా అసలు విషయం బయటపెట్టింది.

"ఓహో ! అలాగా ! అయితే సంతోషమైన విషయమే ! ఏమమ్మా ! ఎక్కడ తను ? చూపించు ! నేనుకూడా చూసి, మాట్లాడతాను'' అని మేజరు కొంచెం అస్యధోరణిలో అన్నాడు.

"మీరు షికారుకు వచ్చారా, లేక ఎవరెక్కడ కూర్చుంటారో, ఏమిటో వివరాలు సేకరించడానికా ? పదండి, ఇంకొంచెం ముందుకు వెడదాం !" అని అన్నది రేఖ కొంచెం కోపాన్ని ప్రదర్శిస్తూ !

అనడానికి రేఖ ఈ మాటలు అన్నదేగాని — లోలోపల ఆమెకు అంతులేని బాధ వేసింది. ఆ ప్రదేశమంతా కలియజూసింది; రోజూ కూర్చునే చోట అతగాడు కన్పించలేదు.

ఇరాకు రేఖ ఆంతర్యం అర్థమైంది.

"ఇంకొంచెం ముందు కెందుకు ? దారిలో ఎక్కడైనా కన్పిస్తాడనేనా ?" అని ఇరా మేజరుతో — "ఏమండోయ్ ! వింటున్నారా ? ఇంత శ్రమ ఎందుకుగాని తిన్నగా షార్ల్‌విల్ హోటల్‌కు వెళ్ళి తెలుసుకుంటే పోలా ? మనకు కూడా పరిచయం కలుగుతుంది" అని అన్నది.

రేఖ కోపంగా ఇరా వైపు చూసిందేగాని, ఆమె అభిప్రాయాన్ని ఖండించలేదు.

అంతా షార్ల్‌విల్ హోటల్‌కు వెళ్ళారు. మేనేజరును విచారించగా తెలిసిన విషయమేమిటంటే — కొన్ని రోజులుగా పన్నెండవ నంబరు గదిలో మహితోష బసుమల్లిక్ అనే వ్యక్తి వున్నాడట ! ఆ రోజు వుదయమే హోటలు వదలి వెళ్ళిపోయాడట !

ఇరా ఈ విషయం విని ఒక్కసారిగా స్తబ్ధురాలైంది. ఎందుకో ఆమెకు మొదటి నుంచీ కొంచెం అనుమానంగానే వుంది — ఆ యువకుడు మహితోష కాదుకదా అని!

మేజర్ సన్యాల్‌కు పరమానందమైంది.

"రేఖ మహితోషను ప్రేమిస్తున్నదీ అంటే మన రొట్టె విరిగి నేతిలో పడ్డట్టే! బావుంది. అతనితో రేఖ వివాహం చేసివేద్దాం. కుర్రవాడు చాలా యోగ్యుడు. కొంచెం పరిచయం కూడా వున్నది. బావుంటుంది. ఈ సంబంధం అన్ని విధాలా మనకు తగింది" అని అన్నాడు.

సిగ్గుతో రేఖ తలవంచుకున్నది. ఇది గమనించి మేజర్ సన్యాల్ — "ఏమమ్మా! అతను నీకిష్టమేగా ?" అని ప్రశ్నించాడు.

రేఖకు ఏమని సమాధానం చెప్పాలో తోచింది కాదు.

"నీ అభిప్రాయమేమిటి ?'' మేజరు ఇరాను అడిగాడు.

తన హృదయంలోని బాధను అణుచుకుంటూ ఇరా మరొక ప్రక్కకు మొహం తిప్పుకొని నిలబడివుంది. వివాహం మాట విన్పించేప్పటికి తనను తాను సంబాళించు కున్నది. వాడిన తన మోముమీదికి లేని నవ్వును తెచ్చిపెట్టుకుంటూ — ''బాగానే వుంటుంది!" అని మాత్రం అనగలిగింది.

## 9

ఆరోజు రాత్రి రేఖ ఇరాను — ''వదినా! మహితోష బాబు నీకు తెలుసా ?" అని అడిగింది.

ఇరా ముక్తసరిగా ''ఊఁ!'' అనిమాత్రం సమాధానం చెప్పి వూరుకుంది. ఏ వుద్దేశ్యంతో ఆమె మసూరీవచ్చిందో, అదికాస్తా మహితోషుడి ఆగమన, నిర్గమనాలతో వ్యర్థమైపోయింది.

మహితోషుడి దాగుడుమూతలాటలో నిహితమైవున్న బాధ మరొక రూపం దాల్చకుండా వుండాలని అతని ప్రయత్నమై వుంటుందని ఇరా భావించింది.

మహితోషుడి ఆంతర్యం మేజర్ సన్యాల్‌కు పొరపాటున తెలిస్తే ఏంగాను ? ఆ రోజున తన బ్రతుకేమవుతుంది! సిగ్గుతో తల నేలకేసికొట్టుకోవలసిన స్థితి ఏర్పడ వచ్చు!

ఇరా రకరకాలుగా ఆలోచించింది. 'మహితోషుడి ఈ ఆత్మ విడంబన, ఈ ఉపహాసం అస్వాభావికమైంది, అనారోగ్య కరమైంది కూడాను. ప్రేమించే అధికారం అతనికున్న మాట వాస్తవమే కావచ్చు; కాని మానసిక ఉన్మాదంలో చిక్కుకొని

ప్రేమయొక్క ఎత్తయిన కవాటాల్ని అధిగమించాలని ఆలోచిస్తున్నాడు. ఈ ఆలోచన స్వస్థకరమైందికాదు. అయినా అత నీవిధంగా దాగుడుమూతలాడుతూ తిరగడం ఏమంత బాగాలేదు. అతను మసూరీవచ్చి కూడా, తమను కలుసుకోకుండా వెళ్ళిపోయాడు! అతనలా యెందుకు చేయాలి?' అని ఏమేమో ఆలోచించింది ఇరా.

## *10*

మూడు మాసాలపాటు హరిద్వారం, ఋషీకేశం, లక్ష్మణఝూలా, బృందావనం, మథుర మొదలైన ప్రదేశాలు పర్యటించి శారీరకంగా, మానసికంగా అలసి సొలసి మహితోషుడు కలకత్తా వాళ్ళ తాతగారింటికి చేరుకున్నాడు. ఎవరిని విస్మరించాలని ఇంతకాలం పిచ్చివాడివలె అక్కడా, ఇక్కడా తిరిగివచ్చాడో, ఆ వ్యక్తిని అతను మరచిపోలేకపోయాడు. పైగా ఈ యాత్రల సందర్భంలో ఇరా మాటిమాటికీ గుర్తుకొచ్చి, అతని మనస్సుని బంధించి అతన్ని మరింత దుర్బలుణ్ణిగా మార్చివేసింది.

దేవేందు మల్లిక్ తన మనుమడి స్థితికి ఎంతో కించపడ్డాడు. అతని మేనత్త హరసుందరీదేవి కన్నీరు మున్నీరుగా యేడ్చింది! ఎందుకంటే మహితోషుణ్ణి ఎత్తుకొని పెంచి పెద్దవాణ్ణి చేసింది. మహితోషు డింకా వెనుకటివలె నిర్వికారంగా, నిష్కామంగా వున్నందుకు మరింత విచారించింది.

రెండురోజులు గడిచాక మేనత్త మేజర్ సన్యాల్ వ్రాసిన వుత్తరం అతనిచేతి కందించింది. ఆ వుత్తరంలో రేఖను వివాహం చేసుకోవలసిందని సన్యాల్ వ్రాశాడు. ఈ వివాహానికి వివశురాలై ఇరా ఒప్పుకొని వుంటుందని, ఆమె మనసారా ఈ వివాహం జరగాలని అభిలషించక పోవచ్చునని — మహితోషు ఏమేమో ఆలోచించాడు. ఇష్టం లేదనిచెప్పి పరిస్థితుల్ని మరింత విషమయం చేయడం అతని కిష్టంలేకపోయింది. మొదట్లో కొన్నిరోజులపాటు అసలు ఇంట్లోనుంచి బయటికే వెళ్ళలేదు. అతని తాతగారు చెప్పినమీదట బయటికెళ్ళి కలకత్తాలో ఉన్నతకుటుంబాలకు చెందిన వ్యక్తుల విలాస జీవితాన్ని అలవాటు చేసుకొనడానికి ప్రయత్నించాడు. ఆ ప్రయత్న ఫలితంగానే లిలీబోసు, మానషీ మల్లిక్, ఆనందతావర్ధన్ మొదలైన నవయౌవ్వనవతుల స్నేహాన్ని సంపాదించాడు. ఈ రకంగానైనా అతను తననుతాను మరచిపోగలనేమోనని ఆశించాడు.

సినిమాలలో ఈ యువతుల పర్షియన్ అత్తర్ల సౌరభం అతని మనస్సుకు స్థిరత్వాన్ని చేకూర్చలేక పోయాయి. బొటానికల్ గార్డెన్‌లో లిలీబోస్‌తో పిక్‌నిక్‌లకు



"మీ రివాల్వరు ఓసారి ఇస్తారూ ?"
"ఎందుకు ?"
"మా పక్కింటాయన కోసం !"
"ఆయన కెందుకు ?"
"ఆయన కక్కర్లేదు; ఆయనకోసం నాక్కావాలి !"

---

వెడుతున్నా ఆమెతో ఘనిష్ఠత ఏర్పడడంలేదు. "పుర్పో"లో టీ త్రాగేప్పటి మానసీ మల్లిక్ మాదకదృష్టి అతనిలో మార్పుతీసుకరాలేదు ; సంధ్యా సమయాలలో గరేడ్-మఠ్ ప్రశాంత వాతావరణంలో ఆనందతావర్ధన్ ఉన్మాదకభావభంగిమలు మహితోషణ్ణి కదిలించలేకపోయాయి. చివరకు అందరూ విసిగి వేసారిపోయారు. మహితోషుడి చాయలకు రావడమే వాళ్ళు మానివేశారు, అతనికి ముక్తిలభించినట్లయింది. అతని హృదయంలో ఇరా స్మృతి ఒక్కటే నిలిచివుంది.

ఆ తరువాత కొద్దిరోజులకు మేజర్ సన్యాల్ మరొక ఉత్తరం వ్రాశాడు. ఆ ఉత్తరంలో ఆయన మహితోషను రావల్సిందిగా వచ్చి కొన్నిరోజులు తమతో గడపవలసిందిగా వ్రాశాడు.

దేవేందు మల్లిక్ పెదాలమీద చిరునవ్వు తాండవించింది. మేనత్త మొహం ఒక్కసారిగా విప్పారింది — ఈ ఆహ్వానానికి కారకురాలు తానే అనే భావం ఆమె

మొహంలో కన్పించింది. మహితోషుడు ఇందుకు అంతగా వుత్సాహం చూపించ లేదు ; అయితే ఆతరువాత కొద్దిరోజులకు తాతనడిగి పదివేలరూపాయలు తీసుకొని రావల్పిండి బయలుదేరి వెళ్ళాడు.

"బాబూ ! కోడలి మొహం ఎప్పుడుచూపిస్తావో మాకు !" అని నవ్వుతూఅన్నాడు మహితోషుడితాత !

మేనత్త విచార వందనంతో – "నాయనా మహీ ! ఇప్పటికైనా నా మాట విని పెళ్ళిచేసుకోబాబూ ! ఎప్పుడు చనిపోతానో ఏమో ఎవరికితెలుసు! నా బొందిలో ప్రాణం వుండగానే నీ పెళ్ళి చూడాలని ఎంతో యిదిగావుంది. నిన్ను సుఖంగా చూడకపోతే నాకు స్వర్గంలోకూడా శాంతి అనేది వుండదు బాబూ !" అని అన్నది.

మహితోషుడు ఆమె మమకారానికి కరిగిపోయాడు. సజల నేత్రాలతో మేనత్తకు నమస్కరించి శలవు తీసుకున్నాడు.

## *11*

రావల్పిండి స్టేషన్‌లో మహితోషుడు దిగాడు. ఎదురుగా మేజర్‌సన్యాల్, రేఖ కన్పించారు ! ఇరా రానందుకు మహీతోషుకు ఆశ్చర్యం కలగలేదు. రైలుదిగడం తోనే మహితోష ఆ ఇద్దరికీ నమస్కరించాడు.

"నీవు అగస్మాత్తుగా మసూరీ వదలివెళ్ళాక, నీ వెక్కడున్నావో, ఏమిటో తెలియక మీ తాతగారికి వుత్తరం రాశాను; ఒకటికాదు; చాలా వ్రాశాను. కాని సమాధానం లేదు. మొన్న నీ టెలిగ్రాం చూసేసరికి నాకు చాలా సంతోషం కలిగింది. నిన్నటి రోజంతా రేఖ నీ గదిని అలంకరించడంలోనే గడిపివేసింది. ఇక ఇరావున్నదంటే నీకోసం రకరకాలైన పిండివంటలు చేస్తూనే వున్నది – నిన్న !'' అని నవ్వుతూ మేజర్‌సన్యాల్ అన్నాడు.

కార్లో మహితోష, రేఖ ఒకేచోట కూర్చున్నారు. మేజర్‌సన్యాల్ ముందుసీట్లో డ్రైవరు ప్రక్కన కూర్చున్నాడు. "ఈ పర్యాయం తప్పదేమో ?''అని అనుకున్నాడు మహితోష !

మింటోరోడ్డులోని బంగళాముందు కారు ఆగింది. ఇరా వరండాలో ఒక మూలన కూర్చొనివుంది. కారువచ్చి ఆగడంతో ఆమె లేచి నిల్చుంది. మహితోషుడు కార్లోనుంచిదిగి ఇరాకు నమస్కరించాడు. ఇరా చాలా చిక్కిపోయింది; కళ్ళల్లో ఆ వెనుకటికాంతి కన్పించలేదు. నవ్వుతూ ఇరా మహితోషుడికి ప్రతి నమస్కారంచేసి అతిస్వాభావికమైన భావంతో – "అలా పారిపోయారే ? ఇంతకాలం ఎక్కడున్నారు ? మీ శరీరాన్ని మీరు బాగా హింసపెట్టినట్టుంది !'' అని అన్నది.





''కట్నాలూ కానుకలూ ఏమీ అఖ్కర్లేదు, కాని ఇప్పుడు అమ్మాయి వంటిమీద వున్న నగలతో అత్తారింటికి పంపిస్తే చాలు.''

**ఆ**తరువాత ఆమె రేఖవైపుతిరిగి — "ఏమమ్మోయ్ రేఖమ్మగారూ! మహితోష బాబు భారం నీకప్పగిస్తున్నాం. కొంచెం జాగ్రత్తగాచూసుకో! ఈసారి పారిపోయారూ అంటే—ఎంత వెదికినా దొరకడం దుర్లభంకావచ్చు! జాగ్రత్తమ్మాయ్!" అని అన్నది...

మహితోషుడు మారుమాట్లాడలేదు. తలవంచుకుని నిలబడివున్నాడు.

"ఈ సంగతులన్నీ తరువాత మాట్లాడుకోవచ్చు! ముందు ఏమైనా టిఫిన్ పెట్టు. మూడురోజులు రైల్లో ప్రయాణంచేసివచ్చాడు. ముందు కడుపునిండా తిండిపెట్టండి, ఆతరువాత ఎన్నిమాటలనాలో అన్నీ అనండి!'' అని అన్నాడు మేజర్‌సన్యాల్ వ్యంగ్య ధోరణిలో!

టిఫిన్ తీసుకునేప్పుడు రేఖ, మహితోష దగ్గర దగ్గరగా కూర్చున్నారు. ఇరా అతి జాగత్తగా టేబుల్ మీద రకరకాల వస్తువులు అమర్చడంలో నిమగ్నమై వున్నది.

టేబుల్ మీద అన్ని వస్తువులు చూసి మహితోషుడు నవ్వుతూ-"నేను ఈ వస్తువు లన్నిటినీ ఒకేసారి తినడానికి రాక్షసుడననుకున్నారా ఏమిటి ?'' అని అన్నాడు.

"అన్నీ ఒకేసారి తినవలసిన అవసరం లేదు. కొంచెం కొంచెంగా తిను! ఇవన్నీ ఇరా తయారు చేసింది" అని మేజర్ సన్యాల్ బిగ్గరగా నవ్వుతూ అన్నాడు.

''నేను అతిథి మర్యాదను పాటించడానికి పూర్తియత్నం చేశాను. అసలే మీకు కోపం జాస్తి! ఏ మాత్రం అజాగ్రత్తగా ప్రవర్తించినా మరల మీరు పారిపోతే ఏంగాను ?" అని అన్నది ఇరా సౌహార్ద్ర పూరితమైన స్వరంతో!

అందరూ ఒక్కసారిగానవ్వారు. మహితోషుడు కూడా నవ్వడానికి ప్రయత్నించాడు; తన కృత్రిమదరహాసాన్ని కన్పించనీయకుండా వుండడానికి ప్రయత్నించి మరీవిషమా వస్థలో పడిపోయాడు. ఇరా అతని పరిస్థితిని గమనించింది. కాని ఆమె ఏం చేయ గలదు ? తన ఆంతర్యంలోని బలహీనత ఎక్కడ బహిర్గతమవుతుందోనని ఆమె భయం! అటువంటిదే జరిగితే ఇంకేముంది!

టిఫిన్ తిన్నతరువాత మహితోషుడు, రేఖ తోటలోకి వెళ్ళిపోయారు. మేజర్ సన్యాల్ హాస్పిటల్‌కు వెళ్ళిపోయాడు. ఇరా రాత్రిభోజనం తయారు చేసే ప్రయత్నంలో వంటయింట్లోకి వెళ్ళిపోయింది.

## 12

డిన్నర్‌పార్టీ, టీ పార్టీ, పిక్‌నిక్, టెన్నిస్, బ్రిడ్జి,—వీటితో కాలక్షేపం చేసే ప్పటికి వారంరోజులు గడిచిపోయాయి. నిత్యం రేఖ మహితోషుడివెంట వుండడం వలన ఇరాతో మాట్లాడడానికి అవకాశమే లభించిందికాదు.

ఇరా స్వాభావిక ప్రవర్తన చూసేప్పటికి మహితోషుడికి పిచ్చెక్కినట్టయింది. మాటలతీరులో, అతిథిసత్కారంలో, స్నేహ మమకారాలు ప్రదర్శించడంలో— ఎక్కడా ఎటువంటి అసహజత అతనికి కన్పించలేదు. ఒక రోజున—మహితోషుడు ఇరాతో "నేను నిన్ను ప్రేమిస్తున్నాను!" అని అన్నాడు. ఆ అప్రియసంఘటన ఆమె అప్పుడే మరచిపోయినట్టుంది. అందుకే ఇరాకు అతనిమీద కోపంలేదు!

మహితోషిడి మనస్సు అస్తవ్యస్తమైంది. రేఖ నిత్యం తనను నీడవలె అంటి పెట్టుకొని వుండడం అతనికిష్టంలేదు. ఇరా తనకు దూరంగావుండడం మహితోషుకు ఎంతో బాధాకరంగావున్నది. ఇక మేజర్‌సన్యాల్ యొక్క సహజబంధుత్వభావన అతనికి మరింత మనఃక్లేశాన్ని కలిగిస్తూన్నది. కాని ఏమిటి గత్యంతరం ? రేఖను పెళ్ళిచేసుకుంటే ఇరాసామీప్యం లభిస్తుంది—ఇది నిర్వివాదాంశం. కాని తాను ప్రేమించ

లేనివ్యక్తిని వివాహం చేసుకోవడమా? ఇంతటి ఘోర అన్యాయానికి పాల్పడడం అతని కిష్టంలేదు.

చివరకు ఒకరోజున ఏకాంతంగా ఇరాతో మాట్లాడే అవకాశం మహితోషుకు లభించింది. ఆ రోజురాత్రి అందరూ కెప్టెన్‌సింగు యింటికి డిన్నర్‌కువెళ్ళారు.

తలనొప్పిగా వున్నదని మహితోషుడు వెళ్ళలేదు. ఇరా వెళ్ళాలనుకున్నది; కాని ఇంట్లో మహితోషుణ్ణి ఒంటరిగా వదిలివెళ్ళడం అంత బావుండదేమోనని — మేజర్ సన్యాల్ కావాలనే ఇరాను ఇంటివద్దే వుండమన్నాడు. ఇరాకు వుండడం ఆట్టే ఇష్టంలేదు; కాని కాదూకూడదంటే — రేఖ, మేజర్ సన్యాల్ — ఉభయులూ సందేహిస్తారేమోనని ఇరా మారు మాట్లాడక వుండిపోయింది.

డిన్నర్ తరువాత మహితోషుడు డ్రాయింగ్ రూంలో కూర్చొని సిగార్ తాగుతున్నాడు. రేడియోలో ఏదో రష్యన్ ట్యూన్ విన్పిస్తున్నది. అగస్మాత్తుగా కాళ్ళ చప్పుడు విన్పించింది. మహితోషుడు ఉలిక్కిపడి వెనక్కితిరిగి చూశాడు. ఇరా నిల్చొనివుంది. ఫారిన్ స్లీపింగ్ సూట్‌మీద పూలుకుట్టిన అందమైన చైనాసిల్కు 'కిమోనా' వున్నది.

మహితోషుడు ఇరానుచూసి ఏదోమాట్లాడాలను కున్నాడు. కాని మాట్లాడలేక పోయాడు. మౌనంగానే వుండిపోయాడు. ఉభయులూ ఒకరినొకరు చూసుకుంటూ వుండిపోయారు. అగస్మాత్తుగా మహితోషుడి నేత్రాంచలాలలో నీరుపడి బిందువులుగా క్రిందికి ప్రవహింపసాగాయి.

ఏం చేయాలో ఇరాకు తోచలేదు. ఆమె నెమ్మదిగా అడుగులో అడుగువేసుకుంటూ మహితోషుడి దగ్గరికెళ్ళి అతనిశిరస్సును తన వక్షంలోకి తీసుకొని కూర్చున్నది. ఆమెకు మాత్రం అపారమైనదుఃఖం లేదూ? ఆమె కళ్ళనుంచి కూడా కన్నీరు కారుతున్నది. ఆ క్షణంలో ఆమె సమాజాన్ని, సంస్కారాలనూ, భర్తనూ, —అందర్నీ విస్మరించింది. ఆమె హృదయలో ఒకే ఒక వ్యక్తి వున్నాడు. ఆ వ్యక్తి: మహితోషుడు; అతని విశాల ఫాలభాగాన్ని ఆమె అతి ప్రేమతో నిమురుతున్నది.

"ఇరా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నేను నిన్ను మరచిపోవడానికి ఎంతో ప్రయత్నించాను; కాని మరచిపోలేక పోయాను ఇరా!'' అని మహితోషుడు అవరుద్ధకంఠంతో అన్నాడు.

"నాకు తెలుసు మహీ!"

"మరి నా సంగతేమిటి ఇరా ?"

"రేఖను పెళ్ళాడి సుఖంగా వుండడానికి ప్రయత్నించు."

"నేనామెను ప్రేమించలేను ఇరా !"

ఈమాట వినేప్పటికి ఇరా రెండుకళ్ళనుంచి కన్నీరు ధారలుగా ప్రవహించింది. పసిపిల్ల మాదిరిగా ఏడ్చింది.

"వివాహమయ్యాక పరిస్థితులన్నీ చక్కబడతాయి." అని అతికష్టం మీద అనగలిగింది.

మహితోషు మారు మాట్లాడలేదు. ఇరాను తన ఒడిలోకి తీసుకొని ఆమె మొహం వైపు తదేకంగా చూడసాగాడు. ఇరాను తన బాహుపాశంలోకి తీసుకొని గట్టిగా అదుముకున్నాడు. ఆ ఉత్తేజంలో ఇరా మహితోషుడి వక్షంలో తన మొహాన్ని దాచుకుని అలాగే ఏడుస్తూవుంది.

ఇలా కొంతసేపు గడిచింది. ఆ తరువాత మహితోషుడు నెమ్మదిగా ఇరా మొహాన్ని తనవైపు తిప్పుకున్నాడు. కన్నీటితో నిండివున్న, భాషాహీనమైన ఆమె రెండు నయనాలను చూసేప్పటికి తనను తాను సంబాళించుకోలేకపోయాడు. ఇరా అధరాలమీద తాండవిస్తున్న రక్తిమజ్యోతి అతన్ని పిచ్చివాణ్ణిగా మార్చివేసింది. తన మొహాన్ని ఇరా అధరాలవైపుకు తీసుకెళ్ళాడు....

ఒక్కసారిగా ఇరాకు తెలివివచ్చినట్టయింది. మహితోషుడి ఒడిలోనుంచి దూకుడుగా లేచివెళ్ళి దూరంగా నిల్చొంది. ఆమెకు మనఃక్లేశం కలిగింది. నిస్సహాయ స్వరంతో–"ఇంట్లో నా భర్త లేని సమయంచూసి నన్ను ఇలా అవమానపరుస్తారా?... నన్ను అవమాన పర్చడమేగాక – మిమ్మల్ని మీరే అవమానపరచుకున్నారు. మీరు వెంటనే ఈ ఇంట్లోనుంచి బయటికి నడవండి. అలా చేయకపోతే నౌకర్ని పిలువ వలసి వస్తుంది." అని అన్నది– కేకపెడుతున్నట్టు !

ఇరాలో కలిగిన ఈ ఆకస్మిక మార్పు మహితోషుకు అర్థంకాలేదు. విస్మితుడై అతనక్కడే కొంచెంసేపు కూర్చున్నాడు. ఆ తరువాత లేచి నెమ్మదిగా బయటికి నడిచివెళ్ళాడు.

ఇరా అక్కడే సోఫాలో మొహంకిందికిపెట్టి ఏడుస్తూ కూర్చున్నది. ఆమెఎందుకు ఏడుస్తున్నదో, ఏమిటో అసలు ఆమెకే అర్థంకాలేదు. కొన్నిక్షణాల అనంతరం ఆమెకు కారుచప్పుడు విన్పించింది. మహితోషుడు కారుతీసుకొని ఎక్కడికో వెడుతున్నాడని ఆమె అనుకున్నది.



"ఈ రేడియోలో డిఫెక్ట్స్ ఏమీలేవు. బహుశ అది ఇంట్లో డిస్టర్బెన్స్ అయివుంటుంది.''

---

నౌకరుతోచెప్పి కారు ఆపించడం, నౌకరుముందు హాస్యాస్పదంగా వుంటుందేమోనని భావించి ఆమె ఆ ప్రయత్నం చేయలేదు. తనగదిలో మంచంమీద పడుకొని ఆమె వెక్కి వెక్కి యేడవటం ప్రారంభించింది.

## *13*

మహితోషుడు మేజర్ సన్యాల్ కారుతీసుకొని బయటికి వెళ్ళిపోయాడు. కారు వాయువేగంతో పరుగెడుతున్నది. కొన్నిక్షణాలలో కంటోన్మెంట్దాటి విశాలమైన రోడ్డుమీది కొచ్చింది.

అంతటా కారుచీకటి అలుముకొనివున్నది. విపరీతమైన చలివేస్తున్నది. మరో రోడ్డు ... నిర్జనంగా వున్నది. ఎత్తైన దేవదారు వృక్షాల వరుసలు—.... మహితోషుడు కారువేగాన్ని పెంచాడు...ఏభై...అరవై—డెబ్భై!...

ఇక కారు వేగానికంటే ఎన్నోరెట్ల వేగంతో మహితోషుడి మెదడులో ఆలోచనలు పరుగులిడుతున్నాయి ...

అతనేం చేయాలి?... అతనికి మార్గం అంటూవున్నదా? ఈ విపత్తును ఎదుర్కొన డానికి ఉపాయమేమీలేదా? ఇరా విచిత్రమైంది ... అతి విచిత్రమైన స్త్రీ: స్వర్గీయ కాంతిని ప్రసరింపజేస్తూ ఉన్మాదాన్ని కలిగించే ఆమె నయనాలు ... సౌందర్యానికి సాక్షాత్తు ప్రతిమూర్తి అయిన ఆమె అవయవ సౌష్టవం, సువాసనలు వెదజల్లే పూల వనంలో సైతం అగ్నిని రగిల్చే ఆమె అందం —... ఇక ఆ మేజరు ... ఆమెభర్త.. పాపం రేఖ ... ప్రపంచం అంటే ఏమిటో తెలియని అమాయకపుపిల్ల ... వీళ్ళంతా కలిసి నన్ను చంపివేస్తారు ... ఇరా జీవితాన్ని నాశనంచేస్తారు — ఇరా ... ఎర్రటి జార్జెటు చీరెకట్టుకున్న ఇరా ... బ్రిచెస్‌ను వేసుకొని గుర్రంమీద కూర్చున్న ఇరా.. ఫారిన్ సూట్ ధరించి కన్నీరు కారుస్తున్న ఇరా ... ఏడ్వకుఇరా! ఏడ్వకు! నీవు కోరినట్టే ప్రవర్తించుకుంటాను ... నీవు ఏంచెబితే అదేచేస్తాను ...

అతని కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. ఎదురుగావున్న దేవదారువృక్షాల వరుస మొదట్లో కొంచెం అస్పష్టంగా కన్పించింది ... ఆతరువాత ఉయ్యాల ఊగినట్టు ఊగింది ... ఆతరువాత అంతా కనుమరుగైపోయింది ... మహితోషుడు కళ్ళు మూసుకున్నాడు ...

## *14*

మేజర్ సన్యాల్, రేఖ ఇంటికి తిరిగి వచ్చేటప్పటికి చాలా పొద్దుపోయింది. అప్పటికి ఇరా నిద్రపోయింది. వాళ్ళు ఆమెనిద్రకు భంగం కల్పించలేదు.

ఆ రెండవరోజు ఉదయానికల్లా మహితోషబసుమల్లిక్ కారుప్రమాదంలో మరణించాడనే వార్త ఆ వాడకట్టులో నిమిషాలమీద వ్యాపించింది.

మేజర్ సన్యాల్ అత్యంత వ్యధిత హృదయుడైనాడు. గదిలో అటూఇటూ తిరుగు తూన్నాడు. రేఖ ఈ వార్త వినడంతో గభాలున సోఫాలో కూలబడిపోయింది. ఇరా కూడా ఈ వార్త విన్నది. ఆమె హృదయంలో ఏవేవో భావాలు కూడుకుంటూ విడి పోతున్నాయి; ఆమె నోటినుంచి ఒక్క మాటకూడా వెలువడలేదు. అంతే — చైతన్య రహితంగా, అలాగే కూర్చుండిపోయింది.



# ఎండ

మన ఊరి చివర. (కిందటేడు వ్యాపారం గురించి కలకత్తాకి వెళ్తూ వెళ్తూ దార్లో అకస్మాత్తుగా చచ్చిపోయిన) మనూరి పాత మొఖాసాదార్‌గారి తోటలో ట్రంకురోడ్డుకి పక్కగా, చీకటిమర్రి చెట్టుకింద ఒంటిగా నిల్చున్న పాడుపడ్డ గదిలో కాపరం ఉంటూ, ఊళ్లో ఇంటింటికీ తిరిగి తిరిగి అప్పడాలూ ఒడియాలూ అమ్ముకు బతికే శారదమ్మగారి ఆరేళ్ళ కూతురు — సుందరం — ఓ రోజు సాయంకాలం వాళ్లమ్మని,

"అమ్మా అమ్మా ! ఎండెప్పుడొస్తుందమ్మా ?" అని అడిగింది.

సాయంకాలం చాలా చీకటిగా చాలా భయంకరంగా మరో ఘడియలోనో క్షణంలోనో మనింటికి రాబోయే చావులా ఉంది. మూడ్రోజులపాటు మన్నూ మిన్నూ ఏకమైపోయి నట్టనిపించింది. ఇవాళ నాలుగోరోజు ఉదయానికి కాస్త తెరిపిచ్చిందే కాని, ఆకాశం మాత్రం రవ్వంత మేరయినా విడకుండా మబ్బుతో దట్టంగా మూసుకుపోయే ఉంది. వర్షంతో పాటు ఈ మూడ్రోజులూ చలిగాలికూడా ప్రచండంగా వీచివీచి నానా భీభత్సం చేసింది. ఈ రోజు మాత్రం గాలి బాగా సద్దుమణిగింది. శారదమ్మ గదివెనక నున్న పాతతోటలో చెట్లన్నీ కూడా పగవాడు తెరిపివ్వకుండా తీసిన పిడుగు దెబ్బకి తట్టుకోలేక చెల్లాచెదురైపోయి అలిసిపోయి మరింక కదల్లేక శవాల్లా ఉండిపోయిన బీదవాళ్ళకోటలోని పేద జనంలా ఉన్నాయి.

"అమ్మా ! ఎండెప్పు డొస్తుందమ్మా?" అని అడిగింది సుందరం.

కూతురు వేసినప్రశ్న శారదమ్మ వినిపించుకోలేదు. ఆవిడ, ఆ కిటికీల్లేని చీకటిగదిగుమ్మం ముందున్న సన్నపాటి నడవలో కూర్చొని, పాతహరికేన్ లాంతరుచిమ్నీ బీటలు విడిపోకుండా నెమ్మదిగా భద్రంగా తుడుస్తోంది.

సుందరం తన ఆరేళ్ళజీవితంలోనూ కూడా ఇంత గాలీవర్షం ఎన్నడూ ఎరగదు. మొదటిరోజున సరదా పడ్డది కాని రెండో రోజు రాత్రికల్లా ఆ పిల్లకి భయం పట్టు

రాచకొండ విశ్వనాథశాస్త్రి

కుంది. మూడో రోజల్లా ఈ వర్షం మరింక తగ్గదు కాబోలు, ఎండ మరింక రాదు కాబోలు అనుకొని బెంగ పెట్టేసుకొని ఏడుస్తూ కూర్చుంది. ఈ రోజు పొద్దున్నించీకూడా వర్షంలేకపోవడంతో ఆమెక్కొంచెం ధైర్యం వచ్చింది. కాని, ఎండ తప్పక రేపొస్తుందని అమ్మకూడా చెప్తే కాని ఆ పిల్లకి పూర్తిగా నమ్మకం కుదరదు.

"అమ్మా! ఎండమ్మా ఎండ! ఎండ ఎప్పుడొస్తుందమ్మా?" అని మళ్ళీ అడిగింది సుందరం.

సుందరానికి ఎండంటే ఎంతో ఇష్టం.

వాళ్ళ నాన్న పైనింకా ఉన్నప్పుడు, రెండేళ్ళ కిందట, కార్తీకమాసంలో వాళ్ళ నాన్నతోనూ అందరితోనూ కలిసి సుందరం వనసంతర్పణకి వెళ్ళింది. నాన్నతో మిల్లులో పన్చేసే మిగతా పనివాళ్లూ, వాళ్ళ ఆడవాళ్లూ, పిల్లలూ అంతా కూడా వచ్చేరారోజున. బంగారం లాంటి ఎండని సుందరం ఆ ఒక్కరోజే చూసింది. అక్కడ కొండవార రాజుగారి పువ్వులతోటలో అంతా చీకటితోనే వెళ్ళి దిగి అక్కడే వండుకొని తినుకొని ఆడుకొని పాడుకొని రోజు రోజల్లా హాయిగా గడిపేరు.

ఆవేళ పొద్దున్నే కొండమీంచి నెమ్మదిగా కిందికిజారిన ఎండ నీలపు పొగమంచుతో కలిసిపోయి నెమ్మదిగా పురివిప్పగా మెరిసే నెమిలిపింఛంలా మెరిసింది. మరి కొంతసేపటికి ఆ యెండే ముద్దుగా విడుకున్న గులాబి పువ్వులతోటలా ఎర్రగా విరిసింది. పది గంటలకి ఎండ వెచ్చవెచ్చగా ఉంటూ కమ్మగా వండిన వంటవాసనల్తో కలిసిపోయి అన్నం తినిపించే అమ్మ చూపులా హాయిగా ఉంది. పన్నెండు గంటలకి చెట్లఆకుల్లోంచి పల్చపల్చగా కిందకి జారిన ఎండ పౌర్ణమినాటి అర్ధరాత్రి పండువెన్నెల్లా సుఖంగా ఉంది. చెట్లకింద కొత్త తాటాకు చాపమీద వెల్లకిలా పడుకున్న సుందరానికి పైనున్న లేతాకులన్నీ ఆకుపచ్చ గాజుతో నాజూగ్గా చెక్కిన గాజాకుల్లా వింతగా కనిపించేయి. ఒంటిగంటకి బాగా తళుకెక్కిన ఎండ కొత్త వెండిగిన్నెలా తళతళా మెరిసింది.

ఎండంటే సుందరానికి ఎంతోఇష్టం. కాని, ఎండని సరిగ్గా చూడ్డానికి ఆ పిల్లకి ఎప్పుడోకాని అవకాశం ఉండదు. శారదమ్మ ఊళ్లోకి పోకపోతే ఆవిడకి దినం గడవదు. అంచేత, సుందరం ఇంటి పట్టునే ఉండితీరాలి. ఇంటికి కాపలాఉండి, చెల్లెల్ని చూసుకోవాలి, అన్నయ్య ఎక్కడికీ పారిపోకుండా కాసుకోవాలి, వాళ్లుండే గదివెనక కొండదాకాఉన్న పాతమామిడి తోట ఎప్పుడూ చీకటిగా ఉంటుంది. నాలుగైదేళ్ళయి ఆతోట పూతాలేదు, కాపూ లేదు. ఎదరగాఉన్న రోడ్డుకూడా రెండు పైపుల్నించీ ఎత్తుగా దట్టంగా కమ్ముకున్న చెట్లతో అదో పొదవాటి గుహలా

ఉంటుంది. సుందరం ఉండే పాతగదికి వీధి వైపుకి ఒక్క గుమ్మంతప్ప కిటికీల్లేవు. గదంతా చాలా చీకటిగా ఉంటుంది. గదికి ఎదురుగా కొంచెం పక్కగా ఉన్న పాతమర్రి చెట్టు, దగ్గిరకొచ్చిన వాళ్లని ఊడల్లాటి చేతుల్తో ఉమ్మల్చుట్టేసి తినేస్తూ కాలం గడిపేసే కదల్లేని ముసిలి రాక్షసిలా చీకటిగా భయంకరంగా ఉంటుంది. కింద నున్న గదిలోకి ఒక్కచుక్కయినా రానీకుండా ఎక్కళ్ళేని ఎండనీ అదే మింగేస్తుంది.తాగేస్తుంది.ఇంట్లోకిఎండ ఎంతగా రాదో అంతగా ఎండకావాలి సుందరానికి.

చుట్టుపక్కల మైలుదూరంలో ఎక్కడా ఇళ్లులేవు. రోడ్డుమీద జనసంచారంకూడా అట్టేఉండదు. అమ్మ లేనప్పుడు వీధి గుమ్మంలో చెల్లెల్ని పక్కనకూర్చోబెట్టుకొని బితుకూ బితుకూ కూర్చుంటుంది సుందరం. ఆ పిల్ల ముఖంలో స్పష్టంగా కనిపించేవికళ్లే. మర్రిచెట్టుకి చాలా అవతల మిగిలిపోయిన ఎండ ఆ కళ్ళళ్ళో బలహీనంగా మెరుస్తుంది. ఆ పిల్ల నోరు, చలిగాలికి ముణుచుకుపోయిన గులాబి మొగ్గలా, చాలా చిన్నదిగా ఉంటుంది. గట్టిగా గెంతినా నవ్వినా ఆమెకి దగ్గొస్తుంటుంది. ప్రాణంతోఉన్న సుందరానికి నీడగాపడిన సుందరంలా ఉంటుంది సుందరం. అందుకే ఆపిల్లని చూస్తూ చూస్తూ 'ఈనీడ ఎప్పుడు మాయమైపోతుందో'నని శారదమ్మ అప్పుడప్పుడు భయపడుతూ ఉంటుంది.

వర్షంపడిన మూర్రోజులూ ఎక్కడికీ పోకుండా శారదమ్మ ఇంటిపట్టునే ఉండిపోయింది. సుందరానికి అది కొంత నయం అనిపించింది. కాని ఆమెకి భయం మాత్రం లోజ్వరంలా అలా ఉంటూనే ఉంది. ఇవాళ వర్షం పళ్లేదు. రేపు ఎండ రాదా అనుకొంది సుందరం. ఆకాశంలో మబ్బులు కొత్త బలాన్ని తెచ్చుకొంటున్నాయని ఆ పిల్ల గ్రహించుకోలేదు. కాని, ఆకాశంవైపు చూస్తేమాత్రం ఆమెకి బెంగ తగ్గడం లేదు.

"అమ్మా! అమ్మా: ఎప్పుడొస్తుందమ్మా ఎండా?" అంటూ తల్లిభుజం పట్టుకుఊపుతూ మళ్లీ అడిగింది సుందరం.

"రేపు రావొచ్చు తల్లీ!" అంది శారదమ్మ చిమ్నీ నెమ్మదిగా తుడుస్తూనే.

"ఎండొస్తుందామ్మా?!!"

"ఎందుకు రాదు తల్లీ?!"

శారదమ్మ అలా అనగానే సుందరం ఎగిరి గంతేసి, తల్లిపక్కనే కూర్చున్న నాలుగేళ్ళ చెల్లెలు సరూతో, "చెల్లీ! చెల్లీ! రేపు ఎండొస్తుందిటే, ఎండ!! మరంచేత దేవుడికి దండం పెట్టమ్మా!" అంది.

సరూ, గౌనులేకుండా లాగుమాత్రం తొడుక్కొని బుద్ధిగా అమ్మపక్క మఠం వేసుక్కూర్చుంది. అక్కమాట వినగానే ఆ పిల్ల వీధివైపు తిరిగి ముద్దుగా ఓ దండం పెట్టింది. సుందరం, చెల్లెల్ని ముద్దాడి, అక్కణ్నించి గదిలోకి పరిగెట్టి, ఆ

చీకట్లో గోడవారకర్రపెట్టెమీదకూర్చున్న అన్నదగ్గిరికివెళ్ళి, "అన్నా ఒరే! ఎండరా ఎండ! ఎండ రేపొస్తుందిట!", అంటూ సంతోషంతో కేకలు వేసింది.

అన్న - అంజిగాడు - సుందరంకంటె రెండేళ్ళు పెద్ద. వాడికి కాళ్ళూ చేతులూ వళ్ళూ పెద్దవిగా ఉంటాయి; తలమాత్రం గుళ్ళో చెంబులా చిన్నదిగా ఉంటుంది. వాడు ఎండా నీడా అంటే తెలుసుకోలేడు; రాత్రో పగలో చెప్పలేడు; నిన్నా రేపూ అంటే అర్థంచేసుకోలేడు; అన్నం కలుపుకు తినలేడు. వాడికి మాటలు రావు. వాడు వెర్రివాడు. వాడెప్పుడూ ఆ కర్రపెట్టెమీదే కూర్చుంటాడు; లేపోతే దాని మీదే పడుకుంటాడు. ఎప్పుడూ నోట్లో వేలు పెట్టుకు కనిపిస్తాడు.

చెల్లెలి కేకలికి భయపడి అంజిగాడు నోట్లోంచి వేలు తీసేసి, "ఏఏఏ" అంటూ కోపంతో కొట్టవచ్చినట్టుగా అరిచేడు. ఆ తరువాత చాలా కోపంగా నోట్లో వేలు పెట్టుక్కూర్చున్నాడు. సుందరం మాత్రం గెంతుకుంటూ తడిపరికిణీ పరపర లాడించుకొంటూ సరూ దగ్గిరకొచ్చి, "లేవే సరూ! రేపు ఎండొచ్చేదాకా ఆడుకుందాం రావే!" అంటూ చెల్లెల్ని చెయ్యి పట్టుకు లేవదీసింది. ఇద్దరూ రంయిమంటూ నడవమీంచి వాకిట్లోకి గెంతి, అక్కడ నిలవనీళ్ళల్లో, చప్పట్లు కొడుతూ, అడ్డం మొదలుపెట్టేరు.

"ఎండొస్తుందీ, రేపు ఎండొస్తుందీ! నెమిలికన్నులా, వెండిగిన్నెలా ఎండొస్తుందీ! ఎంతో చక్కని ఎండొస్తుందీ!" అంటూ సుందరం పాడేపాట శారదమ్మ చెవిలో పడుతోందే కాని, ఆవిడ అదేదీ సరిగా వినడంలేదు.

లాంతరుముందు కూర్చొని శారదమ్మ భగవంతుణ్ని అగ్గిపుల్ల వెలిగించమని ప్రార్థిస్తోంది.

శారదమ్మకి దేవుడియెడల భక్తెక్కువ. ఎన్నివిషయాల్లో భగవంతుడావిణ్ని ఎంత ఎడం పెట్టినా, ఆవిడమాత్రం ఆయన ముంగిటనుండి కదలకుండా మొండిగా కూర్చుంది. ఏడాదికిందట, ఆవిడ పెనిమిటి తను పనిచేసే మిల్లు తాలూకు లేబరు వ్యవహారాల్లోకి కూలి వాళ్ళ తరఫున దిగి, తగువుల్లో ఇరుక్కొని దెబ్బలాటల్లో చిక్కుకొని, ఖూనీకేసులోకి అక్రమంగా ఈడవబడి, యావజ్జీవ కారాగారవాసశిక్ష అనుభవించటానికి వెళ్ళినప్పుడుమాత్రం ఆమెకి దేవుడంటే కొంచెం - అతికొంచెం చిరుకోపం వచ్చింది. పెనిమిటికి శిక్షపడిననాటి రాత్రి ఆమె తన చీకటిగదిలో కూర్చొని, అంతకుముందల్లా ఎంత దీనంగా దేవుణ్ని ప్రార్థించిందో, ఎన్నిసార్లు ఆ దీనరక్షకుడి ముందు భక్తితో మోకరిల్లి ఎన్ని కష్టాల నుండి కాపాడమని ఎంతగా వలవల ఏడ్చిందో తల్చుకొని, తీరని దుఃఖంతో ఉప్పెనగా ఏడ్చింది. "మీ అల్లుడు చావు

బతుకులమధ్య ఉన్నారు; మందు కావాలంటే చేతిలో చిల్లిగవ్వలేదు; పిల్లలకి తిండిపెట్టాలంటే ఇంట్లో చీకటితప్ప ఇకేంలేదు; నా కెక్కడా ఎవరూ సహాయంలేరు; మాయందు దయఉంచి ఒక్కసారి రా నాన్నా !'' అంటూ ఎందరి చేత ఎన్నికబుర్లు పంపినా, ఏడుస్తూ ఎన్ని ఉత్తరాలు రాసినా, భయపడి గుండె బేజారెత్తిపోయి ఎన్ని అర్జంటు టెలి గ్రాములుకొట్టినా ఎంతకీ రానట్టి డబ్బుగల తండ్రిమీద పేదింటికోడలైన ఆడ కూతురికి కోపంవచ్చి అలిగినట్టు ఆమె ఆ రాత్రి భగవంతుడిమీద కోపం తెచ్చుకుని అలిగింది. కాని, ఆ కోపంలో కాఠిన్యం లేదు. ఆ అలగడంలో కల్మషం లేదు. మర్నాటికల్లా ఆమె సర్దుకొంది. భగవంతుడున్నాడు కాబట్టే, అతనెంతో మంచివాడు కాబట్టే తన పెనిమిటికి ఉరిశిక్ష తప్పించి జెయిలుశిక్ష వేయించేడు. ఇంత పనికిరాని తుచ్ఛజీవి ఏడుపువిని ఈ నిర్భాగ్యురాలియెడల భగవంతుడు ఆపాటి దయ చూపించడం అదెంతకాదు ?! మరో పదేళ్ళలో తన పెనిమిట్ని దేవుడే మళ్ళీ తనకి ఇచ్చేస్తాడు. "అబద్ధం కేసులో ఎందుకు ఇరికించేవు ? అన్యాయంగా శిక్ష ఎందుకు వేయించేవు?" అని అడగడానికి తనెవరు, తనేపాటిది ? ఆ దయామయుడికి ఏం తోస్తే అది చేస్తాడు; లేకపోతే, చెయ్యకపోతాడు; అమాయకుల్ని రంపపుకోత కోస్తాడు; నిర్భాగ్యుల్ని నాశనం చేస్తాడు; అసహాయుల్ని హతమారుస్తాడు. అదంతా అతని ఇష్టం, అతనిలీల. ప్రార్థించడమే మనపని కాని రక్షించమని ఆ మహానుభావుణ్ని బలవంత పెట్టడానికి మన మెవరం ?—

అని సమాధాన పర్చేసుకొంది శారదమ్మ.

"అమ్మా అమ్మా! ఆకాశం అంతా మబ్బుగా మన మర్రిచెట్టులా ఉందమ్మా! ఎండ నిజంగా రేపొస్తుందా అమ్మా ?" అంటూ అనుమానంతో నడవలోకివచ్చి అమ్మని మళ్ళీ భయంభయంగా అడిగింది సుందరం.

"దేవుడి దయుంటే ఒస్తుందమ్మా'', అంది శారదమ్మ.

ఆవిడ రాత్రికి దీపం సంపాదించడం గొడవలో మునిగిపోయుంది. లాంతరు వెలిగిద్దామంటే అగ్గిపెట్టి బాగా నానిపోయింది. పుల్లలుచూస్తే మూడే ఉన్నాయి. అందులో రెండప్పుడే వెలక్కుండా ఒట్టిపోయి విరిగిపోయేయి. మూడోది—దేవుడి దయుంటే వెలుగుతుంది, లేకపోతే లేదు.

లేదు, ఈ రోజుకి దేవుడికి శారదమ్మ యెడల దయలేదు. ఈ రాత్రికి ఈఇల్లంతా చీకట్లో ఉండవలసిందనే అతని అభిప్రాయం. అంచేత, చీకటి మరీ ఎక్కువవకుండా పిల్లలకి అన్నాలు పెట్టేస్తే, అందరూ వేగిరం కళ్ళు మూసుకు పడుకోవచ్చు. తెలివున్నంతసేపే కాని తెలివి తప్పిపోయేక దీపంఉన్నా ఒకటే, లేక

"రండి, పిన్నిగారూ ! విన్నారుగా ? మనవరాలు కలిగింది. శాంతిట ! హోమ శాంతీ, గ్రహశాంతీ అంటున్నారు. మా వారు శాస్త్రుల్లగారినడిగొచ్చారు కూడానూ." అని రావమ్మ గబగబా క్షణంలో అన్ని సంగతులూ చెప్పేసింది.

ఆడంగులు మాట్లాడుతుంటే విని సీతప్ప ఎప్పుడూ అసూయపడేవాడు. వాళ్ళు ఎన్నో విషయములు ముచ్చిమూడు ముక్కల్లో చెప్పేస్తారు. ఎలిగ్రాంకొట్టి నట్టేనూ ! వాళ్ళకాట్రిక్కు తెలుసును. మనకి — అంటే మగాళ్ళకి — ఆసులువు తెలీదుమరి. ఒక్క చిన్న విషయంచెప్ప డానికే ఎంతోసేపవుతుంది. అప్పటికీ చెప్పేదిసరిగా చెప్పానాలేదా అన్న అను మానం అట్టే ఉండిపోతుంది. ఆడాళ్ళా ! అమ్మో ! వేదవ్యాసుడాడదై ఉంటే భారత మంతా అయిదుపేజీల్లో రాసును. కాని దాన్నెవరూ చదవకేపోదురు. అదీ అసలు కిటుకు. తనభార్య శేషపిన్నిగారికంతా చెప్పిందేగాని ఆవిడ తెలుసుకోవలిసిన అసలు విషయం చెప్పనేలేదు.

"అసలు సంగతి నేనరటిపండులా వొలిచిపెడతాను వినండి, పిన్నిగారూ ! నక్షత్రమైతే చెడ్డదేనూ. చెడ్డనక్షత్ర మన్నాక శాంతీ గట్రా చేసుకోకవీల్లేదా యిరి. ఏమంటారు ? మీరేచెప్పండి. శాస్త్ర రీత్యానున్నూ, ఈ శాంతిగట్రా మన మంచికేగాని దీనివల్ల గ్రహగతులు మారేది లేదుగదా. ఎవరో మహాపతి వ్రతలు—అదైనా ఏద్వాపరయుగంలోనో ! కలియుగంలోపుట్టుకొ్కదు !— సూర్యచం ద్రాదుల్ని నిలవేశారుగాని, ఈ కాలంలో మనతరమా ? అయితే ఈ శాంతీగట్రా ఎవరిమంచికీ అన్న ప్రశ్నొస్తుందిగదా మరి. గ్రహ వీక్షణంవల్ల ఎవరికి చెరు పుంటే వారేగద శాంతి చేసుకోవాలి ! ఇప్పుడీ సందర్భంలో శాంతిచేసుకునే పూచీ అంతానున్నూ మా వియ్యంకుడు గారిమీదే పడినట్టు శాస్త్రుల్లగారు స్పష్టంగా చెబుతున్నారు," అన్నాడు సీతప్ప.

పిన్నిగారసాధ్యురాలు ! సిద్ధాంతిగారి కోడలా, మరోటా ! ఠకీమని, ''మాతా మహస్థానానికి చెరుపని శాస్త్రుల్లగారు చెప్పారందురూ !" అనేసింది.

సీతప్ప మొహం శీతాకాలంలో కొబ్బరి నూనెలా పేరుకు పోయింది. ఆయన ఒక్క గుటకేసి. "మాతామహ—తానూ— అంతయిదిగానున్నూ—తాతత్తా—" అన్నాడు.

''చెరుపు పితామహస్థానానికో, మాతా మహస్థానానికో స్పష్టంగా తేల్చుకోవా లన్నగారూ," అన్నది శేషపిన్ని.

సీతప్ప కొంచెం తెప్పరిల్లుకుని, "అదే వచ్చిపడింది. ఆ శాస్త్రుల్లగారేదీ స్పష్టంగా చెప్పలేదు. అసలు గ్రహశాంతేవిటి పొమ్మ నటాన్నాడు కాస్సేపు. మరి కాస్సేపు శాంతిచేసుకోవడం మంచిదేనూఅన్నాడు. ఇంకాస్సేపు తాతగారికి చెరుపన్నట్టే

చెప్పాడుమరి. పిల్ల—అంటే మాకోడలు—పుట్టింది లగాయతూనున్నా—నా ఉద్దేశం, పెళ్ళయాకకూడా—వారింటేఉండి, అక్కడే పురుడోసుకుని, అక్కడే అంతా గనక గ్రహదోషం వారినే హెచ్చుగా బాధిస్తుంది గదా అని—" అంటూ నీళ్ళు నవిలాడు.

"నువు మాత్రం తాతవు కాదుటయ్యా, వెర్రిబ్రాహ్మడా?" అనేసింది శేషుపిన్ని. "బారసాల అవులెల్లుండనా అన్నారు? నిక్షేపంగావెళ్లి శాంతిచేసేసుకోండి. మెడ మీద తలున్నవాడెవడూ శాంతి వద్దండు!"

శేషు పిన్నిగారు చాలా సేపు కూచుని దుష్టనక్షత్రాల ప్రభావమూ, దుష్ట గ్రహాల ప్రభావమూ గురించి ఎన్నో ఉదాహరణలు చెప్పింది. సీతప్ప ఒక చెవితో అదంతా వింటూనే ఇంకో చెవితో కర్తవ్యం ఏవిటిగదా అని తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

"—ఆ పిల్ల నవర్తాడిన నక్షత్రం మహా చెడ్డది. వైధవ్యయోగవని మా మావగారప్పుడే చెప్పేశారు. శాంతి భారీ ఎత్తున జరిపారు. వారికేం? మహారాజులు, లక్షాధికార్లు. తరువాత గర్భాదానానికి ముహూర్తం కూడా నిర్ణయించారు. ఎల్లుండి గర్భాదానవనగా పిల్ల మొగడు కాస్తా చచ్చి ఊరుకున్నాడు. ఆ మరుస టేడు దాని మేనమావ కూతురు అదే నక్షత్రాన రజస్వల అయింది. శాంతి చేశారు. నక్షత్ర జపం చేయించారు. గర్భాదానం కాకుండానే దాని మొగుడూ పోయాడు...ఇప్పుడు మీ మనవడు పుట్టిన నక్షత్రానే ఆ కోదండరావయ్యగారి రెండో కోడలు కూడా ప్రసవించింది, బిడ్డకు ఆరునెల్లు నిండకుండానే కోదండ రావయ్యగారి ఇల్లూ, పొలాలు తుడిచి పెట్టుకు పోయాయి. మరో ఆరు నెల్లకి కోదండ రావయ్యగారికే కాలం తీరి పోయింది..."

ఇలాటి దాఖలాలన్నీ వింటున్నకొద్దీ సీతప్పకూ, రావమ్మకూ కూడా గుండె బెదురు హెచ్చిపోసాగింది. శేషు పిన్ని గారు వస్తానం జెప్పి లేచి వీధి గుమ్మం కూడా దాటిందో లేదో, రావమ్మ, "ఏవవనీండి గాక, ఎంత ఖర్చవనీండి గాక, శాంతి యథావిధిగా జరిగితీరవలిసిందే!" అన్నది.

"నాకూ అలానే అనిపించింది స్మీ. నే నింకా దూరవాలోచించాను. నక్షత్రాలే ఎంత చెడ్డవో విన్నాం గదా. నక్షత్రాల కన్న గ్రహాలు బలవత్తరమైన వాయెను. చెడ్డ నక్షత్రవంటే, ఆ నక్షత్రాన నవర్తాడవో, పురుడు రావడవో జరిగితే ఆ ఒక్క మనిషికి మాత్రవే చెరుపు; తతిమ్మా మనుషులంతా సుఖంగానే వుంటారు. గ్రహాలలాక్కాదే. అవి నక్షత్రాల్లాగా ఉన్నచోటుండక ముందుకీ ఒక్కొప్పుడు వెనక్కీ నడుస్తూంటాయిట. అవి రాగూడని చోటి కొచ్చాయో యావన్మందికీ చెరుపే. వీడూ వాడూ అన్న విచక్షణ వుండదు. ఓః, భూకంపాలేవిటి,

సముద్రాలు పొంగి పడవలు మునిగిపోవడ మేవిటి. పడవల్లో వాళ్ళు అలో లక్ష్మణా అంటూ తెప్పకొయ్యలూ, తెరచాపలూ పట్టుకొని సముద్రంలోపడి, దారీ తెన్నూ తెలీకుండానున్నా కొట్టుకు పోవడ మేవిటి, ఇల్లు ఉన్న పళంగా గభాల్న కూలిపోయి ఇంటిల్లిపాదీ దానడుగున నలిగి చచ్చి పోవడ మేవిటి, ఎన్నయినా భయోత్పాతాలు జరుగుతాయి. వచ్చే మాసం రాబోయే నవ గ్రహ కూటం వుంది చూడూ. ఎన్నడూ కనీ విననిది. ఉత్తినే రైళ్ళుపడి పోవడాలూ, ఇళ్లు కూలిపోవడాలూ, తుఫానూ వచ్చి వేలాది జన నష్టం కలుగు తోంది గదా, ఈ నవగ్రహ కూటవెలా వుండబోతుందో వూహించుకో! అసలే బిడ్డకలిగిన నక్షత్రం శాంతి నక్షత్ర వంటున్నారాయిరి. మనం పట్నానికి నలభై మైళ్ళలోపున ఉండడం ప్రమాదం. మనం బారసాలకు పోదాం. పోయి, ఈ గ్రహకూటం దాటిపోయిందాకా అక్కడే ఉండిపోదాం. రాకరాకొచ్చావని వియ్యాలవారు సంతోషిస్తారు. సోవిదేవి సంగతి చెప్పే అక్కర్లేదు. ఒకపూట వియ్యాల వారింటా, ఓ పూట సోవిదే వింటా, ఓ పూట వారింటా, ఓ పూట వీరింటా—! మంచి ఆలోచనే చేశానని నువ్వొప్పుకు తీరాలి!"

"మీరాలోచన చెయ్యడవూ, అది మంచిది కాకపోవడవూనా?" అన్నది రావమ్మ ముసిముసి నవ్వులు నవ్వుతూ.

## 3

"వచ్చేశాం!" అన్నాడు సీతప్ప వియ్యాల వారింట అడుగు పెడుతూనే.

"ఎందుకూ?" అన్నాడు సత్యం మావగారు సీతాపతి గారు.

"ఇవాళేగదూ బారసాలా, శాంతీ గట్రా—?" అన్నాడు సీతప్ప బిత్తర పోయి.

"శాంతి వద్దన్నారుగా? ఆ ప్రయత్నవే మానుకున్నాం" అన్నాడు సీతాపతి.

"ప్రయత్నవే మానుకున్నారా? చెడ్డ నక్షత్రవన్నారు?" అని సీతప్ప అడిగాడు.

"మాకు నక్షత్రాల పట్టింపులూ అవీ లేవు. మాదంతా బ్రహ్మసమాజం పద్ధతి గదూ? మీరే మూఢత్వం కొద్దీ అలాటివి జరిపించి తీరాలంటారేమోనని ఓ కార్డు ముక్క రాసి పడేశాను. మీ జవాబు చూడగా మీ కవేవీ పట్టనట్టు కనబడింది. మరీ మంచిది లెమ్మనుకున్నాం."

సీతప్పగుండెల్లో ప్రళయం ఆరంభ మయింది. పరిస్థితి ఇలా విషమించి పోయిందని సీతప్ప కల్లో గూడా ఊహించలేదు. బ్రాహ్మలు చెప్పేదాని కన్న దానాలూ అవీ మరోనయాపైసా హెచ్చుగానే ఇద్దావటాని బాంకిలోంచి ఆరువందలుతీసి భార్యను వెంటబెట్టుకుని చక్కావచ్చాడు. కాని ఏం ప్రయోజనం శాంతిలేదు సరేగదా, బారసాలా, నామ

కరణవ్వూలేదు; గుమ్మాలకీ పసుపు కుంకాల్లేవు. అధమం ఓ మావిడిమండైనా కట్టారుగాదు! ఇది నాస్తికత్వమనుకోవాలో, పచ్చి కమ్యూనిజమనుకోవాలో సీతప్పకి బోధపడిందికాదు. చాలా కాలంగా తనని ఏదో దుష్టగ్రహం వేపుకు తింటుందన్న అనుమానం మరింతరూఢి అయింది. ఏం చెయ్యబోయినా పొద్దెదురవుతూంటే ఎలా యీడవడం?

''పోనీ ఇప్పుడు శాంతికి ఏర్పాట్లు చేస్తేనో?'' అన్నాడు సీతప్ప.

''మీకు సాధ్యవయేట్టుంటే మహారాజులా చేయించండి. వ్యవధిలేకుండా ఏర్పాట్లుచూడ్డం నావల్ల అయేపనిగాదు. అయినామీరు మీ ఆలోచన మళ్ళీ ఎందుకు మార్చేసుకున్నారో నాకర్థవవకుండా వుంది,'' అన్నాడు సీతాపతి.

సీతప్ప ఒక్కగుటకవేసి ఊరుకున్నాడు. ఏడవడానికీ, ఏం చెయ్యడానికీ ఆయనకుపాలుబోకుండా వచ్చికూచుంది..

రావమ్మను చూస్తూనే ఇంటిఆడవాళ్లు, "వచ్చారా? రావనుకున్నావే?" అన్నారు. సీతారత్నం అత్తగారిని పలకరించనైనాలేదు. బాలింతరాలంటే ఎంతో కళగా, నవనవలాడుతూండాలి, ఏకళాలేదు. స్నానవయిందిగాబోలు, జుట్టుకు ధూపంవేసుకుంటోంది.

రావమ్మగారు, "మనవరాలేదీ? నాకూడాచూపరూ?'' అన్నదాకా ఎవరూ కదల్లేదు.

''శాంతంటే మాకు నమ్మకం లేదన్నారు. నావకరణమైనా చేసుకోవడం లేదేం?'' అన్నది రావమ్మ.

"అది పుట్టకముందే అడపిల్ల అవుతుందని మా నరసుచెప్పేశాడు.దానికి ఆవా అని పేరెట్టేశాడుకూడాను, '' అన్నారు వాళ్ళు.

"బొడ్డూడనిపిల్లకి అవ్వని ఎవరేనా పేరెట్టుకుంటారా?'' అన్నది రావమ్మ విస్తుపోయి, చెయ్యితిప్పి గడ్డకింద సపోర్టుపెట్టుకుంటూ.

"అవ్వకాదు. ఆవాగార్డనరు—మా అన్నకి అభిమాన హాలీవుడ్‌తార. చాలా అందంగా ఉంటుంది. ఎన్నోలక్షలమంది ఆవిడకి రోజూ ప్రేమలేఖలురాస్తూంటార్ట. ఉన్నమొగుణ్ణి వదిలేసి మమల్ని పెళ్ళిచేసుకోమని కోటీశ్వరులు అడుగుతూంటార్ట!'' అని సీతారత్నం అత్తగారికి వివరించిచెప్పింది.

రావమ్మకు వాంతి అయినంతపని అయింది. అలాంటిమనిషిపేరా బిడ్డకి పెట్టుకునేది? ఏ పతివ్రతపేరో, దేవుడిపేరో పెట్టుకోక!

ఆమెకక్కడ ముళ్ళమీద ఉన్నట్టుండి ఎదుగారువున్న సోవిదేవిని చూడటానికెళ్ళింది.

తల్లినిచూడగానే సోవిదేవి మొగం విప్పారింది.

"వచ్చావా, అమ్మా? నాన్నకూడా వచ్చాడా? మీరు రావడంలేదని చెప్పారూ.

సరేగాని శాంతి వొద్దాన్నారటేవిటీ? ఎక్కడేనాకద్దా? అంత పాడునక్షత్ర మన్నప్పుడు శాంతిచేసుకోరూ? నాన్న ఇలాగంటాడని నేను కల్లోకూడా అనుకో లేదుసీ్మ!" అన్నది సోవిదేవి.

"దానికంతా వుందిలే; ఆయన శాంతొద్దనిరాయలేదు. అలా ఒక్కనాటికీ రాయరు. శాంతిఖర్చులు అయిదొంద లవుతాయి అచ్చుకోమంటే, అంతడబ్బు లేదు, కొంతమీరుకూడ భరించండవ టాని రాసుంటారు. పోనీగాని చిత్తుగా డేడీ? అల్లుడుగారు కులాసాయేగదా? పార్వతికి మళ్ళీ యేమైనా—?"

"ఏంలేదు. పాపం ఆవిడికి సంతాన రేఖఉన్నట్టు కనబడదు,'' అంటూ సోవిదేవి నిట్టూర్చింది. అంతలోనే గొంతుమార్చి, ''చిత్తుగాడు బడికెళ్ళి పోయాడు, వాడింటో క్షణంవుండడు. ఊరంతా వాడికి నేస్తాలేనూ!" అన్నది.

"వాడి దారేవేరు!" అన్నదితల్లి.

వాళ్ళు మాట్లాడుకుంటూండగానే సీతప్పవచ్చాడు.

సీతాపతివాళ్ళింటిలోవాళ్ళంతా అదో రకం మనుషులనీ, సత్యాన్ని ఏవంత మర్యాదగా చూట్టంలేదనీ, వాడస్త మానమూ ఆ ప్రెస్సులుకాడుండి అడవా చాకిరీ చేస్తున్నాడనీ; రాత్రిబవళ్ళు విధి విరామవూ వుండడంలేదనీ సోవిదేవితల్లి దండ్రులతో మాటసందర్భగా అన్నది.

కాని సీతప్ప అదంతా కొట్టవతల పారేశాడు.

"వాడిప్పుడు వాళ్ళలో మనిషేనూ. అలాటప్పుడు మర్యాదేవిటీ? ఆత్మీయతా, ఆప్యాయతా ముఖ్యంగానీ! పనంటావూ? సొంతపనేగదూ? మనపని మనం చూసు కోకపోతే మరెవరు చూస్తారూ? ఇంకో గమ్మత్తు చూశావూ? మనవాడలా అహో రాత్రులు, అన్నాహారాలులేక, ఎండనక, వాననక, చెమటోడ్చి పరిశ్రమించడంవల్ల అత్తవారికి వాడంటే వల్లమాలిన అభి మానవూ అదీ పుట్టుకొస్తుంది. వాడోపూట ఖాయిలాపడ్డాడనుకో, చెయ్యివిరిగినట్టయి పోతుంది. ఏవిటనుకున్నా వేవిటోనూ!... ఆ సంగతివదిలేయ్! ఇప్పుడసలు ఉపద్రం పట్నానికొచ్చింది. నువ్వినేవుంటావు. పేద్ద ఉప్పెనొచ్చేసి పట్నంచుట్టూతా నున్నా ముప్పైనలభైమైళ్ళ మేర ముంచెత్తేస్తుందిట. వెయ్యినిలువుల నీరు ఇరవై నాలుఘ్గంటల పాటలా నిలిచిఉండి పోతుందిట. ఇళ్ళు కూలిపోవడవేవిటి, ఊపిరాడక మనుషులు చచ్చిపోవడవేవిటి అడక్కుమరి! దారుణం!... వీళ్ళింకా తెలుసుకోకుండా ఉన్నారు. వెయ్యినిలు వుల ఉప్పునీరొచ్చేస్తే గరిక్కూడా చచ్చూరుకుంటుంది. పట్నంచుట్టూ ముప్పైమైళ్ళపేర యెడారైపోతుందంటే నమ్ము... ఇంకో గమ్మత్తుచూశావా? ఆ యెడారి గజం పావలాకిమ్మన్నా ఇచ్చే స్తారు. ఓ రెండెకరాలుకొని ధరలు పెరి

గాక ఇళ్ళస్థలాలకింద అమ్మేద్దా మవటాని అమ్మ ఆలోచనచేసింది. అలాగే చేద్దాం గాని ముందు ఈ ప్రళయంనుంచి ప్రాణాలతో బయటపడనీ అన్నా. పారిపో యొచ్చేశావంటే నమ్మంతే :"

సోవిదేవికి ఒక్కటే అనుమానం వచ్చింది.

"ఈ జల ప్రళయం గురించి ఇక్కడ కూడా తెగచెప్పుకుంటున్నారు. కాని వెయ్యేడుగుల నీరొస్తుందని మాత్రమే అంటున్నారే ?'' అన్నదామె.

"వె-య్యేడుగులా ? ఇంకానయం ! వె-య్యేడుగులయితే చెప్పుకోడందేనికీ ? వెయ్యి ని-లు-వులు !" అన్నాడు సీతప్ప కళ్ళుపెద్దవిచేసి. ఆయనకు ఎక్కడలేని కవిత్వమూ పుట్టుకొచ్చేసింది. జరిగిన సంఘటనలు కళ్లారాచూసినవాడు వర్ణించిన విధంగా ఆయన జరగబోయే జలప్రళయ భీభత్సాన్ని కూతురికి వర్ణించిచెప్పాడు.

మాటల సందడిలో సీతప్పకి కాలం ఎలా గడిచిందీ తెలియలేదు. "గనక నున్నూ, మేంజేసిన ఆలోచన ఏవిటంటే నున్నూ, ఎలాగో ఇల్లుకదిలి రానేవచ్చేశాఁవా, చెప్పుల్లో ప్రయాణం బెట్టుకుని వస్తే అటు వియ్యాలవారూ ఒప్పరు, మీ ఆయనా ఒప్పడు. ఇదేవిటి ? ఇప్పుడొచ్చి ఇప్పుడే వెళ్ళిపోవడవా, వల్లగాదవ టంటారు తప్పవిడిచి మరొహాటుండ బోదు. అంచేతను మరోనాల్రోజులక్కడా, సరదాగా ఉండిపోయి, యేకంగా జల ప్రళయం తీశాక తిరిగిపోవడానికి నిశ్చయించుకు చక్కావచ్చాం – చెప్పొద్దూ ? నెల్రోజులు సెలవడిగేశాను. నే సెలవు తీసుకుని ఏళ్ళయిందంటే నమ్ము. మా ఆఫీసులో మిగిలిన వాళ్ళంతా తద్దినాలనీ, ఊరికెళ్ళాలనీ, అక్కరొచ్చిందనీ చీటికీ మాటికీ సెలవుచీట్లు పంపిస్తూంటారు. నేనలా ఎన్నడూ చెయ్యను. ఎందుకడ గాలి, ఎందుకు లేదనిపించుకోవాలి ? శరీరం అమ్ముకున్నాక పనిచెయ్యవలిసిందే. పనంటే పనేనూ ! రోట్లో తలదూర్చి రోకటి పోటుకు జంకితే ఎలా? ఎన్నడూ సెలవడిగి యెరుగనేమో అడగ్గానే గ్రాంటు చేసి పారేశారు. చక్కావచ్చాం. రాకరాకొచ్చి నాల్రోజులైనా కళ్లెదుటుండకుండా కట్టుదిట్టఁవై మరీ వచ్చావనుకో !" అని సీతప్ప అంటుండగా ఫ్యాక్టరీలు కూశాయి.

"అమ్మయ్యో ! అప్పుడే పన్నెండే ? ఏవేవ్, వేగిరం, వేగిరం ! అవతల పెద్ద మనుషులు మనకోసం ఆపోశన పట్టకుండా కనిపెట్టుక్కూచునుంటారు. పద, పద !" అని సీతప్ప భార్యను తొందరచేశాడు.

కానిసీతాపతిగారింట్లో భోజనాలెప్పుడో అయిపోయాయి. ఆ సంగతి తెలీక సీతప్ప తన వియ్యంకుణ్ణిచూసి, "ఈ బ్రాహ్మ డింకా భోజనం చేసేయత్నంలో లేడేవిటి చెప్మా?'' అనుకున్నాడు.

రావమ్మని వియ్యపరాలు మాత్రం, "మీ సోవిదేవిగారింట ఈపూట వంటకాలేవిటో?" అనడిగింది.

"తెలీదునమ్మండీ. అడిగానుకాను." అన్నది రావమ్మగారు.

"మీరింకా భోజనాలే చెయ్యలేదూ? ఎంతకీ రాకపోతే అక్కడే భోంచేశారనుకున్నాం."

కడిగిన వంటిల్లో చితచితలాడుతోంది. వంటకాలు చప్పచల్లారిపోయాయి. సీతప్ప నాలుగు మెతుకులు నోటవేసుకున్నాననిపించాడేగాని ముద్దదిగడం చాలాకష్టమైపోయింది. రావమ్మగారు తినొచ్చేసరికి కూరమిగల్లేదు. మజ్జిగ గట్టిగా రెండు చెంచాలు మిగిలింది.

ఆ పుణ్యదంపతులు భుక్తాయాసంలేని భోజనంచేసి బయటి అరుగుమీద చేరారు 'కాస్సేపు నడుం వాలుస్తారాయేవిటి?'. అన్నవారుగాని, ఓ మంచంవేసి మర్యాద చేసినవారుగాని లేరు.

'తప్పుపట్టడానిక్కాదుగాని, వీరి మాటతీరూ మర్యాదతీరూ అదోమోస్తరుసుమండీ! ఇప్పుడేం? అబ్బిపెళ్ళినాడే ఈ సంగతి గమనించా,'' అన్నది రావమ్మ.

"నేనొక్కటే చెబుతున్నా చూడూ. మనం అలాటివేవీ పెట్టుకోగూడదు. మన సంగతి చంద్రమతీ హరిశ్చంద్రులవంతు అయింది. ఇల్లూవాకిలీ విడిచివచ్చేశాం. మనచూరుకింద మనం నిలబడే యోగ్యత లేకుండా చేసేశాయి నవగ్రహాలు. నవగ్రహ జపవ్యాగ్రటా అవుతుందిగదా అనుకుంటే ఇక్కడ అసలుశాంతే జరగలేదు. అంచేత మనని ఈ గ్రహాలు ఓ పట్టాన వదిలిపెట్టవు. మనవా. ఇవాళొచ్చి రేపెళ్ళిపోతున్నవాళ్ళం కాకపోతిమి. ప్రళయం జరిగిపోయి, కలియుగం ముగిసి మళ్ళా కృతయుగంఆరంభమయే వరకూనున్నా ఇక్కడే ఉండిపోతున్నా అలాటప్పుడు మాటలనీ, మర్యాదలనీ పెట్టుకూర్చుంటే అవుతుందా? కలిపీడితులైన నలదమయంతులను ఆ మహారణ్యంలో ఎవరు మర్యాద చేశారు? ఏవిటో! మనం వారికన్న లక్షరెట్లు నయమనుకో–లక్షరెట్లు!" అన్నాడు సీతప్ప తలకింద చెయ్యిపెట్టుకుని పడుకుంటూను.

రావమ్మ మాత్రం గోడకి చేరగిలబడి కూచుని, "ఇదేం ప్రయాణం! ఇదేంకథ కోడలు నీళ్ళాడింది. చంటిబిడ్డను చేతిలో పెట్టి ముచ్చటలు పలికినవాళ్ళులేరు. కొడుకింతవరకు కంటికే కనిపించలేదు. ఎప్పుడనగా వెళ్ళాడో, ఎక్కడ అన్నం తిన్నాడో? బారసాలలేదు, పాడూలేదు. నిన్నంటే నిన్నపుట్టిన బిడ్డకి అవ్వఅని పేరెట్టారట! చూడగా అంతా కలలాఉంది గాని నిజంలాగాలేదు ... గోదావరి నీరు పట్నం నీరులా క్కాదు. ఆనది కరకరలాడుతుందిగాబోలు ...'' అనుకుంటూ కూచునే కునుకులు పడింది.



# సినిమా క్విజ్




పై మూడు బొమ్మలూ మూడు సినిమాల పేర్లు తెలియజేస్తవి... ఏమిటవి?

(జవాబులు 93 వ పేజీలో)

# స్వామి వివేకానంద

పవిత్రమగు మానవ జన్మమెత్తి, వారి జీవితములను మోక్ష సాధనకై సార్థకము చేసికొనక, క్షణిక సుఖములకు దాసులై, అజ్ఞానాంధకారముతో సంసార సాగరమున మునిగి తేలుచు, దైవచింత లేని మానవులు పరమాత్మ జ్యోతిని చూడజాలరు. అట్టివారలకై సర్వసంగ పరిత్యాగమొనర్చి, బ్రహ్మచర్య వ్రతమునుదాల్చి, సత్యాన్వేషణకై తదేక దైవ చింతతో తాము తరించుటయే గాక మానవకోటి సంతతిని తరింపజేయుటకై జీవితములనే త్యాగమొనర్చిన దైవాంశసంభూతులలో అగ్రగణ్యుడు శ్రీ వివేకానంద స్వామి.

1863 జనవరి 12-వ తేదీకి సరియగు దుందుభి నామ సంవత్సర పుష్య బహుళ సప్తమి సోమవారము, హస్తా నక్షత్రయుక్త ధనుర్లగ్నమున ఉదయము 6 గం॥



*స్వామి వివేకానందుని శతవార్షికవర్ధంతి ఈ నెల 12వ తేదీన మనం పాటించవలసివుంది. ఈ సందర్భంలో ఈ ప్రత్యేక వ్యాసం మా పాఠకులకు ఉపయుక్తం కాగలదు.*

*ప్రప్రథమ ప్రపంచ సర్వమత మహాసభలో మన ప్రతినిధిగా పాల్గొని మన మత స్వారస్యాన్ని ఎలుగెత్తి చాటి భారతదేశ ప్రతిష్ఠ ఇనుమడింపజేసిన వ్యక్తి వివేకానందులు.*

34 నిమిషములకు సుగుణరాశి యగు భువనేశ్వరీదేవికి, దత్తవంశ ప్రభువగు విశ్వనాథునికి ఈశ్వరాంశ సంభూతు డగు బాలు డుదయించెను. ఆ బాలుని జన్మరాశి ననుసరించి వీరేశ్వరుడని పేరిడిరి. తరువాత నామకరణ సమయమున నాతనికి నరేంద్రుడను పేరు వచ్చెను. తలిదండ్రు లతనిని 'బిలే' యనియు, 'నరేన్'అనియు ముద్దుపేర్లతో పిలుచుచుండిరి.

పూజలకు పుట్టినిల్లగు దత్తవంశమున బుట్టుటచే, నరేన్ బాల్యమునుండియు భగవచ్చింతా పరాయణుడై, ఏకాగ్రతతో ధ్యానము చేసెడివాడు. తన్మయత్వమున బాహ్యప్రపంచమును విస్మరించి, అంతు లేని ఆనందము పొందెడివాడు. బిచ్చ



మెత్తుటకై వచ్చు బైరాగులనిన నరేంద్రునకు అమిత ప్రీతి. చేత నేవస్తువున్ననూ వారికి దానము చేసెడివాడు. నరేంద్రుడు ఏకసంథాగ్రాహి. అచిర కాలముననె సకల విద్యల నభ్యసించి, సంస్కృతభాషా ప్రవీణుడై, తోడి బాలురలో అసమాన ప్రజ్ఞాశాలిగా పేరు గాంచెను. వర్ణభేదము చూపక బాల్యము నుండియు సర్వమానవులను ఆదరించెడివాడు. పిన్నవయసునుండి మాతృదేశమన్న భక్తిగౌరవము లుండుటచే, పరభాషయగు ఆంగ్లము నభ్యసించుటకు నిరాకరించియు, తలిదండ్రుల పట్టుదలపై సమ్మతించెను.

నరేంద్రుడు మాతృభక్తి పరాయణుడు. ఆతనికి తల్లి చేసిన బోధలు మూడు: 'ప్రాణభయము కలిగినను అసత్యమాడకుము, సదుద్దేశములనుకలిగి, ఎల్లరు నీ మంచితనమును గుర్తించి నీయంతటి మంచివాడు లేడనిపించుకొనుము, ఇతరుల స్వాతంత్ర్యమున కెన్నడు ఆటంకము కలిగించకుము.' ఈ దివ్యబోధలను శిరసావహించి నరేంద్రుడు తన జీవితమును ప్రకాశవంతము జేసికొనెను. 'నా మానసికాభ్యుదయమునకు హేతుభూతాలు నా తల్లియే' అనుచు సదా అతడు పలికెడివాడు. ఎంతటివాడైనను మాతృమూర్తి నారాధించనిదే గొప్ప స్థితిని పొందజాలడని పలుమారులు నరేంద్రుడు నొక్కి వక్కాణించెడివాడు.

సన్యసించవలెనని సంకల్పమున్నను, దారిద్ర్యము వీడి, తమ కుటుంబమున అనుకూల పరిస్థితులు కల్పించి, తల్లిని తృప్తిపరచువరకు నరేంద్రునకు మనశ్శాంతి కలుగలేదు. భువనేశ్వరిదేవిని సాక్షాత్ దేవిగానే అతడు పూజించెడివాడు.

తండ్రి విశ్వనాథుడు ఉదార హృదయుడు. జాతిమత విభేదములు లేనివాడు. మానుషత్వమే ఔన్నత్య హేతువన్న గాఢవిశ్వాసము కలవాడు. స్వమత ఆచార ధర్మములందు ఆసక్తి కలవాడు. ఇట్టి సద్భావములుగల తండ్రి శిక్షణలో పెరిగిన నరేంద్రుడు తండ్రిని మించిన కొడుకనిపించుకొనుటలో ఆశ్చర్యమేమున్నది!

నరేంద్రుడు గానకళలోకూడ ప్రవీణుడు. తన కోమల కంఠస్వరముతో జనుల సమ్మోహితుల జేసెడివాడు. మూడేండ్ల చదువు నొక్క సంవత్సరములో ముగించి ఉత్తీర్ణుడై, తండ్రివలన గడియారము బహుమతి నొందెను. కళాశాలలో ప్రవేశించి, పాశ్చాత్య చరిత్రలనేకములు చదివి లోకజ్ఞానమును వికసింపజేసికొనెను.

ప్రతి విషయమును విమర్శించుట నరేంద్రుని అలవాటు. ఆత్మమోక్ష జగత్కల్యాణములకై జన్మించిన అతనికేదో అసంతృప్తి, తీవ్ర వాంఛ కలుగనారంభించెను. జీవితమునకు ఆహార నిద్రాదు

లచే కలుగు సుఖము పరమావధి కాదని తెలుసుకొనెను. 'భగవత్సాన్నిధ్యమునకు పాండిత్యమేల? పుస్తకముల్లో నేమున్నది?' అనుచు నరేంద్రుడు పరీక్షా సమయములందుకూడ భక్తి పారవశ్యముతో పాడుచుండెడివాడు.

భగవంతు నిదర్శనమునకై ఆతని వాంఛ ప్రబలమైనది. తండ్రి అతనికి వివాహము చేయ దలచి విఫలుడయ్యెను. భార్యాభర్తలై సకలైశ్వర్యములతో ప్రతిష్ఠలతో లౌకికానందమును పొందు గృహస్థ జీవనము కంటె_సమస్తము త్యజించి సుఖదుఃఖాల కతీతుడై, పరమేశ్వరాశ్రితుడై, స్వేచ్ఛతో శాశ్వతానంద ప్రాప్తికై ప్రాకులాడు సన్యాసి జీవితమే అతనికన్ని విధముల మేలని తోచెను. సన్యాసికి సంసారికి గల భేదము మేరు పర్వతమునకు ఆవగింజకును, సూర్యునకు మిణుగురు పురుగునకును మధ్య గల వ్యత్యాసము వంటిదని నరేంద్రుడు తలచెను.



కొంతకాలము బ్రహ్మ సమాజమున గడపెను. అతని కక్కడ మనశ్శాంతి లభించలేదు. భగవత్సాక్షాత్కారము కాని జీవితము నిరర్థక మనిపించెను. కడకు దేవేంద్రనాథటాగూరువద్ద కేగి నరేంద్రుడు 'మీరు దేవుని చూచినారా ?' అని యడిగెను. వారి సమాధానముతో తృప్తి కలుగలేదు. ఆ సమయమున శ్రీ రామ కృష్ణుని గురించి, ఆయన ప్రఖ్యాతిని గురించి విని, ఆ మహానుభావునివలన తన సంశయము బాపుకొనవలెనని సంకల్పించెను. నానాటికి దైవ సాక్షాత్కారవాంఛతో నరేంద్రుని హృదయ పరితాపము మిక్కుట మయ్యెను.

కొన్నాళ్ళకు నరేంద్రుని తపము ఫలించి శ్రీరామకృష్ణుని దర్శనమయ్యెను. నరేంద్రునిచూచి శ్రీరామకృష్ణ పరమ హంస అతనిని సంకీర్తన చేయుమనెను. ఆ గానమునకు రామకృష్ణుడు ఆనందాశ్చర్యములతో, బాష్పపూరిత నేత్రములతో, "తండ్రీ! ఎంతకాలమునకు నాపై దయదలిచి వచ్చితివి? చిరకాలముగ నీకై వేచియుంటిని. నీతో నా ఆత్మానుభవములను ప్రసంగించి, నా తాపము తీర్చుకొందును. మానవకోటి బాధలను బాపుటకై అవతరించిన నారాయణుడవే నీవు అను రహస్యము నే నెరుగుదును'' అనుచు తన మనసులోని సంతసమును వెల్లడించెను.

నరేంద్రుడు చెంతలేకున్న రామకృష్ణుని హృదయము వ్యాకులము చెందెడిది. "నిన్ను చూడనిదే నే జీవించలేను. నా యొద్దకురమ్ము'' అని విలపించెడివాడు. ఇరువురును ఈ విధముగ ప్రాణమునకు ప్రాణమై పరస్పరము ఆకర్షించుకొనిరి. నరేంద్ర రామకృష్ణుల సమావేశమువలననే నవీన ప్రాచీన ఆదర్శముల నద్భుత రీతిని సమన్వయపరచు భావి భారత భాగ్యోదయ దివ్యవాహిని బయల్పడెను. పాశ్చాత్యులకార్యదీక్షతో తమభారతీయుల ప్రశాంతియుతాత్మ ధ్యానదీక్షను కలిపి. సనాతన ధర్మ పునఃప్రతిష్ఠాపనకై ఈదివ్య వాహినియే వివేకానందుని అవతారము దాల్చినది!

రామకృష్ణుని చేష్టలు, వచనములు తొలుత నరేంద్రునికి ఆందోళన కలిగింపసాగెను, తన సందేహము తీర్చుకొనుటకై అతడు ''మహాశయా, తాముదేవుని చూచితిరా?'' అని శ్రీరామకృష్ణుని ప్రశ్నించెను. అందులకాయన వెంటనే ''నిన్ను చూచునట్లె భగవంతుని చూచుచున్నాను. నీతో మాటాడునటులె దేవునితో మాటాడుచున్నాను. నిజముగా దేవునికై తపించువారికి భగవంతుడు తప్పక ప్రత్యక్షమగును''అని బదులిడెను, నరేంద్రుడు అర్థముచేసికొనలేక, శ్రీరామ కృష్ణుడు పిచ్చివాడని భావించెను. అత డెట్లు భావించినను రామకృష్ణుని సముఖమున అపూర్వానందము, అనిర్వచనీయ సౌఖ్యము ననుభవించుచుండెను. కాని,

ఆ వెంటనే రామకృష్ణుని తన గురువుగా స్వీకరింప లేకపోయెను.

ఒకనెల పిదప నరేంద్రుడు పాద చారియై ఆయనవద్ద కేగెను. అత్యంత ప్రీతితో రామకృష్ణుడు తన పాన్పుపై కూర్చుండబెట్టి, తన కుడి పాదమును నరేంద్రునిపై నుంచెను. ఆ సమయమున అతనికి అపూర్వానుభవము కలిగెను. చరాచర ప్రపంచమంతయు శూన్యమయి, లయించిపోవునట్లు గోచరించెను. తన వ్యక్తిత్వమే నశించునట్లు, మృత్యుముఖ మున పడబోవునట్లు కన్పించెను. మరి యొకమారు రామకృష్ణుడు సమాధి నిమగ్నుడై నరేంద్రుని స్పృశించెను. ఆ మహానుభావుని అద్భుత ప్రభావమను సూర్యరశ్మిచే నరేంద్రుడు పరిపూర్ణముగా బాహ్యస్మృతి రహితుడయ్యెను. స్మృతి కలిగి చూచుసరికి శ్రీరామకృష్ణుడు మెల్లగా గుండె నిమురుకొనుచుండెను. ఈ దివ్యానుభవముల వలన శ్రీరామకృష్ణ పరమహంస లోకాతీతుడని ఎరింగి, నరేంద్రు డాయనకు శిష్యాగ్రగణ్యు డాయెను. ఆ యిరువురి అన్యోన్య ప్రేమానురాగములు అనుపమానములు, ఒకే శరీరమున జీవాత్మలవలె వారుండిరి. రామకృష్ణుడు నరేంద్రునకు అద్వైత వేదాంత రహస్యముల నుపదేశించెను. సంశయములతో మానసిక వ్యథ కలిగి నపుడు నరేంద్రుడు రామకృష్ణుని వచనములు స్మరించి, ధ్యానసిద్ధుడై, మన శ్శాంతి నొందెడివాడు.

అవతార పురుషుడైనను కష్టదశ ననుభవింపక తప్పదు. తన తండ్రియగు విశ్వనాథుని మరణానంతరము నరేంద్రు నకును కష్టదశ ప్రారంభమాయెను. పరమ భక్తురాలైన భువనేశ్వరీదేవికి సైతము, దుఃఖము సహించలేక దేవునిపై నొక విధమైన ఏహ్యా మేర్పడెను. దేవుడే నిజముగ నున్నచో తన కిటువంటి కష్టమేల కలుగునని వాపోయెను. కాగా, గృహ పరిస్థితులు నరేంద్రుని మనసున కూడ నాస్తికత్వము నుద్భవింపజేసెను. ప్రార్థనలు వ్యర్థమని, దేవుడు లేడని నిరూపింప సాగెను.

కాని, కష్టపరంపర అను నీ అగ్ని జ్వాలలే నరేంద్రుని జీవితాభరణమునకు వన్నెదెచ్చినవి. ఆతని స్థితిని తెలుసు కొని శ్రీరామకృష్ణుడు నరేంద్రుని మంద లించి, మనసున ఉదయించిన నాస్తికత్వ మును నిర్మూలించి, అతనిని సత్యమార్గ మున పెట్టెను.

తనయింట తాండవమాడుచున్న దారిద్ర్య బాధనుండి విముక్తుని చేయుమని నరేంద్రుడు ప్రార్థించెను. అందులకు గురుదేవుడు ఆ కాళీమాతనే ప్రార్థింపు మని బోధించెను. కాళీమాత ఎదుట నిలిచి నరేంద్రుడు కలిమిని కోరలేక పోయెను. ఆమె సందర్శన మాత్రమున

మైమరచిన నరేంద్రుడు తన కుటుంబ పరిస్థితులను చక్కజేయమని కోరుటకు బదులు నిర్మల భక్తి జ్ఞాన వైరాగ్యములు ప్రసాదింపుమని ప్రార్థించెను.

కాళీమాతా వరప్రసాదియై, ఆరేండ్లు శ్రీరామకృష్ణుని యొద్ద శిక్షణపొంది, ఆయన ప్రబోధమువలన జ్ఞానజ్యోతిని గాంచి, అఖండ ఆనందమును పొందెను. శ్రీరామకృష్ణుడు కామినీ కాంచనములను జయించి ధ్యానదీక్షతో ఆర్జించిన తత్వ జ్ఞాన సామ్రాజ్యమునకు నరేంద్రుడు యువరాజయ్యెను. ఆ దివ్యానుభవ రత్నరాసులను లౌకికాలయమగు ప్రపంచమంతట వ్యాపింపజేసి, ధర్మసముద్ధరణకై అతడు నడుము కట్టుటకు కృతనిశ్చయుడాయెను.

ఈ సమయమున గురుదేవునకు కంఠమున వ్రణమయ్యెను. శిష్యగణమంతటితో కూడి నరేంద్రుడు ఎనలేని పరిచర్య సేయుచుండెను. ఎక్కువ మాటాడరాదని వైద్యులు రామకృష్ణుని నిరోధించిరి. ఆ స్థితిలోనైనను ఆయన తన బోధనలను మానలేదు. విశ్రాంతి కొరకాయనను కాశీనగరం కొంపోయిరి. మరణశయ్యపై నుండియు రామకృష్ణుడు తన మహోద్యమమును కొనసాగించుచు, శిష్యబృందమునకు ప్రబోధము చేయుచునే యుండెను.

పలు జన్మార్జిత తపఃఫలమగు నిర్వికల్ప సమాధి నరేంద్రునకు లభించెను. గురుదేవుడు తన అవసాన సమయమున నరేంద్రుని చేరబిలిచి, శిష్యగణము నెట్లు ఏకసూత్ర బద్ధులను చేయనగునో, సన్యాస జీవితమునకు వలయు శక్తి సామర్థ్యములు ఎట్లు అలవరుచుకొన తగునో, ఉపదేశించెను. శిష్యులను ప్రేమాదరములతో చూడుమని చెప్పెను. నరేంద్రుని తదేక దృష్టితో చూచుచు, శ్రీరామకృష్ణ పరమహంస ధ్యాన నిమగ్నుడయ్యెను. ఆ క్షణమున నరేంద్రునిలో నేదియో అపూర్వ శక్తి ప్రవేశించినటుల గోచరించెను. రామకృష్ణుడు తన అఖండ శక్తిని, అనిర్వచనీయ ప్రతిభను, ఆధ్యాత్మిక సంపదను జగత్కల్యాణము కొరకు నరేంద్రునికి త్యాగము చేసెను. కాళీమాతను స్మరించుకొనుచు శ్రీరామకృష్ణ పరమహంస 1886 సం॥ ఆగస్టు 16 వ తేదిన భౌతిక శరీరమువదలి పరబ్రహ్మైనందైకము నందెను.

గురుదేవుని ఆజ్ఞానుసారము నరేంద్రుడు ఆయన శిష్యవర్గమున కంతటికి పెద్దయై, కాషాయాంబరముల దాల్చి, శిష్యగణముతో కాశీనగరమునుండి 'బారా' నగరము చేరుకొని, ఒక యింటిని అద్దెకు తీసుకొనెను. అందు శ్రీరామకృష్ణుని అస్థికలను స్థాపించి, ఆయన ఛాయా చిత్రమును ఆవిష్కరించి, పూజించెను. ఇదే మొట్టమొదటి శ్రీరామకృష్ణ మఠము. 'కాకరుగాచి' అను గ్రామమున నొక రామకృష్ణాలయము నిర్మితమైనది.

నరేంద్రుని నాయకత్వమున 1886 నుండి 1892 వరకు 'బారా' నగరముననె యుండి, పిదప ఆ మఠము బేలూరులో ప్రతిష్ఠిత మయ్యెను.

నిర్విరామముతో, నిరంతర దీక్షతో నరేంద్రుడు తోడి శిష్యులచే ఈశ్వరనామామృతసుధను గ్రోలించెడి వాడు. శిష్య బృందమును స్వశక్తిపై నిలుపదలచి, స్వామి ఆసేతు హిమాచల పర్యంతము పర్యటన సల్పెను. మొట్ట మొదటి మజిలీ కాశీనగరము. నరేంద్రుని దర్శించిన మహాపండితులు, నాస్తికులు, పామరులు, ఎల్లరు ఆతని వాక్చాతుర్యమున కచ్చెరువొంది, నిశ్చేష్టులై ఆనంద పారవశ్యమున తేలిరి.

ఇట్లు నరేంద్రుడు సమస్తమైన పుణ్య క్షేత్రములను దర్శించెను. సంకీర్తనలతో, సద్గ్రంథ పఠనముతో, తత్వవిచారణతో కాలము గడపెను. ఆయనకు మహమ్మదీయులు కూడా ఆతిథ్య మొసగి, స్వామి బోధనలచే ధన్యులైరి.

దక్షిణ యాత్రలలో జరిగిన సంఘటన స్వామివారి వాక్చాతుర్యమునకు గొప్ప నిదర్శనము. ఆళ్వారు మహారాజు స్వామిని సన్మానించి, "నాకు విగ్రహారాధనయందు నమ్మకములేదు. ఇంత వరకు నేను ఏ రాతిని గాని, పుట్టనుగాని పూజించలేదు. ఇట్లు నాకు నమ్మకము లేనందున నా గతి ఏమగును, స్వామీ!" అనుచు వ్యంగ్య ధోరణిలో ప్రశ్నించెను.

తదయక స్వామి రాజు ఛాయా పటమును తెప్పించెను. ప్రక్కవానితో దానిపై నుమియుమనెను, ఇందుకు అక్కడి వారందరు హడిలి పోయిరి. స్వామి రాజువంక తిరిగి, 'రాజా! ఇది ఛాయా పటము మాత్రమే కద. ఈ పటమునకు ప్రాణము లేదు. దానికి కదలిక లేదు. అయినను అది నీ చిత్రము. నీపై గల గౌరవ మర్యాదలు ప్రజలు నీ పటముపైనను చూపుచున్నారు. అటులే దేవతా విగ్రహములను పూజించువారికిని వారి వారి మనోభావముల ననుసరించి, పరిజ్ఞానము ననుసరించి పటములందు భగవంతుడు గోచరించును.'' ఈ మాటలు విన్న ఆళ్వారుమహారాజు తనతప్పిదము తెలుసుకొని, భగవంతుని ప్రార్థింప సాగెను.

ఇట్లు పలువురు నాస్తికులను సన్మార్గమునకు మరలించుచు, స్వామి యాత్రలను కొనసాగించెను. కొంత కాలము యాబూ పర్వతమున తపమాచరించి. క్షత్రీ మహారాజును కలిసికొని, స్వామి తన తత్వబోధలతో ఆయనను తన శిష్యునిగా జేసుకొనెను.

దరిద్రులై, విద్యావిహీనులై, మానవత్వమును కోల్పోయి, స్వాతంత్ర్యము లేక అల్లాడుచుండిన సోదర భారత కోటి నుద్ధరించుటయే స్వామి సంకల్పించిన మహత్కార్యము. మహారాజులను ధర్మపరులుగా చేసిన, దేశాభివృద్ధికి తోడ్ప

డుదురన్న ఆశతో రాజుల నెందరినో కలిసెను. వారందరు స్వామి సందర్శన ముచే సంపూర్ణ పరివర్తనులైరి. అంత టితో స్వామి తృప్తిచెందలేదు. హైందవ దీన నారాయణుల దుర్భరస్థితి, అక్షర జ్ఞానశూన్యత నరేంద్రుని మరింత కలవర పెట్టెను. మాతృదేశ పునరుద్ధరణకై పశ్చిమ ఖండముల కేగి, ధన మార్జించి మానవసేవ జేయ నిశ్చయించుకొనెను. అభీష్టసిద్ధికై స్వామికి క్షత్రీ మహారాజు ప్రయాణ సన్నాహ మంతయు జేసెను. మహారాజు కోరికపై స్వామి నరేంద్రుడు జగత్ప్రసిద్ధమగు 'వివేకానందు' నామము ధరించెను.

మాతృమూర్తి యగు శ్రీశారదామణి దేవి ఆశీర్వాదముతో స్వామి వివేకా నందుడు 1893 సం॥ మే 31 వ తేదీన పశ్చిమ ఖండ యాత్రకై బయల్దేరెను. సముద్ర తీరమున ప్రవేశించుచున్న స్వామి దివ్యదర్శనముతో శ్రీ రామ కృష్ణుడు తనను అనుసరించుచున్నట్లు గాంచెను. చైనా, జపాను మున్నగు దేశములను పర్యటించి, అచట భారత జాతీయతను ప్రసరింపజేసెను.

కొలది దినములలో స్వామి తన గమ్యస్థానమగు షికాగోనగరము చేరెను. 1893 లో జరిగిన విశ్వమత మహాసభ ప్రపంచ చరిత్రలో ఒక గొప్ప సంఘ టన. అందు స్వామి వివేకానందుడు హిందూమత ప్రతినిధిగా నిలచి, హైందవ సనాతన ధర్మతత్వమును, శ్రీ కృష్ణుని సందేశములను ప్రపంచ మంతటికి చాటెను. పాశ్చాత్య ప్రముఖ తత్వజ్ఞులు, కళాప్రపూర్ణులు, పండిత ప్రకాండులు నగు పదివేలమందితోనున్న ఆ మహా సభలో వివేకానందస్వామి సర్వజనాకర్ష కుడై కూర్చొనియుండెను.

"నదులు వేరు వేరు తావుల బుట్టినను, అవన్నియు సాగరమున కలియుచున్నవి. అటులే, వివిధ భావములతో మానవులు అవలంబించు ఆరాధన విధానములు ఆ సర్వేశ్వరునే చేరుచున్నవి. సర్వధర్మ ముల సారమే వేదాంతము. ఆత్మ నిత్య శుద్ధము. జననమరణాతీతము, మానవుడు అమృత పురుషుడు. అతడు ప్రకృతి కధీనుడు కాడు. భగవద్దర్శనము లభించు టకు అహంకారము నశించవలెను. భౌతిక దృష్టితో చూచినను ఏకత్వమే అద్వైత సిద్ధాంతము. వ్రతములు, ప్రార్ధ నలు, ధ్యానములు చిత్తశుద్ధికి తోడ్పడు నవి. వేదములు ఆ సర్వేశ్వరుని జేరు మార్గమును చూపునవి'' అనునివి స్వామి యుపదేశములలో కొన్ని.

స్వామి దివ్యసందేశము, నిర్మల మనోభావములు సభికులను ఆశ్చర్య చకితుల జేసెను. ఫలితముగ స్వామి సాటిలేని జగద్విఖ్యాత మహాప్రవక్తయై నిలచెను. ఆయన తన పర్యటనలో భార

తీయుల పాశ్చాత్య వ్యామోహమును గురించి చింతించెను. సంకుచిత భావములచే జాతీయత నిర్జీవమై కళావిహీనమై యుండుటను కూడ తలపోసెను. ఇట్టి సమయమున, పాశ్చాత్యులచే భారత సనాతన ఔన్నత్యమును గుర్తింప జేయుట తన విధిగా నెంచెను. ''పూజ్యత, పవిత్రత, త్యాగము ఏ మత సంస్థకును ప్రత్యేక హక్కులుకావు. ప్రతి మతమునకును లోకోత్తర చరితులగు స్త్రీ, పురుష లుద్భవించిరి. కనుక అన్యమత ద్వేషము అవివేకము. అహమునకు బదులు సహకారము, అన్యమత ద్వేషమునకు బదులు తదాశయ గ్రహణము, శతృత్వమునకు బదులు శాంతియుత సమన్వయము గుర్తించు మంచి కాలము త్వరలోనే వచ్చి తీరు'' నని స్వామి ఘంటాపథముగ ఉగ్గడించుచు, గంభీరోపన్యాసము కావించెను.

ఈ యుపన్యాసములతో స్వామి షికాగో, బోస్టన్, కేంబ్రిడ్జి, వాషింగ్టన్, న్యూయార్కు అంతటను విజయయాత్ర సాగించెను. స్వమతహంకారులగు క్రైస్తవులు వారి లోపములను గుర్తించి వివేకానందుని ఉద్యమము ననుసరించిరి. ఈ ఉపన్యాసముల సందర్భమున స్వామి కోరకనే బహుళముగ పారితోషికములు చేరెను.

ఇదే సమయమున భారతదేశమందు నూతన సంచలనము, ఉత్తేజము కలిగినవి. అప్రయత్నముగ స్వామికి అసాధారణమగు యోగసిద్ధులు లభించినవి. వాని మహిమవలన స్వామి స్పర్శ మాత్రమున ఒరుల జీవితములను మార్చగల శక్తిని పొందెను. ఈ విధముగ మహోపన్యాసము లొసగుచు ఒక సంవత్సరము పర్యటించెను. తదుపరి ఆంగ్ల దేశమునకు వెళ్ళి అచట తన యుద్యమము నారంభించెను. లండన్ నగరముననుండగా మిస్ మార్గరెట్ నోబిల్ అను ఆంగ్లవనిత తన సర్వస్వమును సమర్పించి స్వామికి శిష్యురా లాయెను. ఈమెయే, సనాతన ధర్మమున అఖండ సేవచేసి, త్యాగధర్మము నెరపి, భారతీయుల కృతజ్ఞతకు పాత్రురాలైన 'సోదరి నివేదిత.'

వేలాది విదేశీయులు స్వామి బోధనలు విని భారత జాతీయతను అభినందించిరి. వేదాంత విషయములనుగూర్చి సోదరి నివేదిత 'జన సామాన్యము నమ్మునట్టి క్రైస్తవమత సిద్ధాంతములను బురదనీటిని వడియగట్టుటకై వేదాంతమను యిండుపగింజ నేడు మాకు లభించినది. అంధకారమున అల్లాడుచుండిన మాకు వేదాంత జ్యోతిమార్గ దర్శకమైనది' అని యామె వ్రాసినది.

వేదాంత సందేశముచే పాశ్చాత్యలోకమును జయించి విజయధ్వజ స్థాపన మొనర్చి, వివేకానందస్వామి స్వదేశము

నకు బయల్దేరెను. ఈ వార్త తెలియగనే భారతీయు లెల్లరు వేయికనులతో స్వామి రాకకై ఎదురు చూచుచుండిరి. ఆనందాతి శయముతో, జయ జయ ధ్వానాలతో అందరూ ఆయనకు ఘనస్వాగతము పలికిరి. కొలంబో నగరమునుండి పలు చోటుల సన్మానములంది, స్వామి తన జన్మస్థానమగు కలకత్తాకుబయలుదేరెను. ఆయనను చూడగనే మహోత్సాహముతో నిండిన వంగదేశీయులగాంచి స్వామి పులకిత గాత్రుడయ్యెను.

విశ్వమానవ కల్యాణమునకై శ్రీరామ కృష్ణుని తత్వములను ఆచరించుటకు, పరులకు తోడ్పడుటకు వివేకానందుడు శ్రీరామ కృష్ణుని సంఘములను స్థాపించెను. దేశమున వివిధ రాష్ట్రములలో మఠ ములను, ఆశ్రమములనునెలకొల్పెను. వైద్యశాలలు, విద్యాలయములు, సేవా శ్రమములు మున్నగు సంస్థలను ప్రతి ష్ఠించి, మానవ సేవ జేయుటయె శ్రీరామ కృష్ణ సేవాసంఘముయొక్క ప్రధానోద్దే శము. వివేకానందస్వామి ఉత్తదేశమున పర్యటించి తన సందేశమును వ్యాప్తి చేసెను. ఐకమత్యము, త్యాగము, సేవా నిరతి ప్రజలలో పెంపొందించెను. 1898 డిసెంబరు 9-న వివేకానందస్వామి శాస్త్రోక్తముగ శ్రీరామకృష్ణ మఠ ప్రతి ష్ఠనుచేసెను. అన్నదానము, జ్ఞానదానము అను విధ్యుక్త ధర్మములను ఆచరించు టకు తగిన శిక్షణను శిష్యుల కొసగెను.

మాతృమూర్తి శారదామణిదేవి ఆశీస్సు లందుకొని వివేకానందస్వామి 1899 జూన్ 20 తేదీన సోదరి నివేదిత, తురీయానంద స్వాముల సమేతముగ అమెరికా దేశమున పునఃపర్యటనముచేసి, అనేకమైన భక్తి యోగోపన్యాసము లొసగెను. కాలిఫోర్నియా, సాన్ ఫ్రాన్సిస్కో, ఓర్లాన్డు, ఆల్ మెడో మున్నగు నగరములందు వేదాంత సంఘములు స్థాపించెను. పారిస్ నగ రమున మత చారిత్రక మహా సభలో స్వామి ఉపన్యసించెను, వియన్నా, కాన్స్టాంటినోపిల్, ఏథెన్స్, ఈజిప్టులను పర్యటించి, భారతదేశమునకు పయన మయ్యెను.

అధికారం, స్వార్థములతో కూడిన పాశ్చాత్య వర్తకధోరణి స్వామికి అస హ్యముగ, నరకప్రాయముగ తోచెను. నిరంతర కార్యదీక్షతోను, పర్యటనల తోను విశ్రాంతి నెరుగని స్వామి వివేకా నందుని ఆరోగ్యము దినదినము క్షీణింప సాగెను. అయినను, స్వామి సహజో త్సాహముతో శిష్యులకు బోధలు చేయుచు, ప్రసంగించుచు, వారికి స్వధర్మములను గుర్తుకు తెచ్చెడివాడు. దీనజన సేవయే జీవిత పరమార్థమని మరిమరి బోధింప సాగెను.

చరమదశలో స్వామికి ప్రపంచ సం బంధములన్నియు తీరిపోయినవి. శ్రీరామ

కృష్ణ పరమహంస దివ్యరూపమొక్కటే ఆయన హృదయ ఫలకమున నిలిచి యుండెను. గంగానదీ తీరమున శిష్యులకు ఒక స్థలముచూపి, పంచత్వము పొందిన పిదప తన నచ్చట దహనము చేయుమని కోరెను. మహాసమాధికి వారంరోజులు ముందుగనే స్వామి పంచాంగములో నొక పుటతెరచి, ఒక తిధి కెదురుగా గురుతుంచెను. ఆ గురుతుపెట్టిన దినముననే సరిగ, స్వామి భౌతిక కాయమును త్యజింపనున్నారని శిష్యులెల్లరు ఆయన నిర్యాణానంతరము గ్రహించిరి.

1902 సం॥ జూలై 4-వ తేది నాడు స్వామి వివేకానందుడు తాను పంచాంగమున గుర్తించిన శుభకృత్ నామ సంవత్సర జ్యేష్ఠ బహుళ చతుర్దశీ శుక్రవారమున – గురుదేవుడగు శ్రీరామకృష్ణుని సందేశములను లోకములను చాటి, ఆ మహామహుని మనోభీష్టము నెరవేర్చి, ముప్పదితొమ్మిది వత్సరముల అయిదు నెలల నాలుగు దినముల ప్రాయమున తనువుచాలించి పరబ్రహ్మైక్యము పొందెను.

యావదావనికి వేదవేదాంత సందేశామృతముల నొసగి, జగత్కల్యాణము నకై, తన జీవిత సర్వస్వము నర్పించిన శ్రీ వివేకానందస్వామికి మానవలోక మెంతయు ఋణపడియున్నది. ★

---

## సినిమాక్విజ్ జవాబులు

*1.* పెళ్లి సందడి

*2.* పెళ్లి తాంబూలం

*3.* పెండ్లి పిలుపు

# మనస్తత్వాలు

చెల్లెలు వివాహం నిశ్చయమయ్యిందనీ, ఫలానా తేదీన వివాహం జరుగుతుంది గాబట్టి, ఓపదిరోజులు ముందుగా మీ రిద్దరూ రావల్సిందనీ, శారదకి వాళ్ళ నాన్న వుత్తరం రాశాడు. శంకర్రావుకి కూడా మరో ఉత్తరం రాశాడు. శారద ఆనందానికి పరిధి లేకపోయింది.

''మనం యెప్పుడు వెళ్తామండీ?'' వుత్సాహపూరితంగా అడిగింది భర్తను.

శంకర్రావు క్షణం మౌనం దాల్చాడు.

''నువ్వు వెళ్ళు శారదా రేపు ... నేను రాలేను...'' అన్నాడు మెల్లగా.

“మరి — మీరు యెప్పుడొస్తారు ?''

“నేను రాలేను...'' సాలోచనగా, యింక అధికం మాట్లాడదల్చుకోలేదన్నట్టుగా, ముక్తసరిగా అన్నాడు.

శారద స్తంభించిపోయింది. భర్త నుండి అటువంట జవాబు వస్తుందనిగాని, అంత ముభావంగా జవాబిస్తారని గాని ఆమె యెప్పుడూ వూహించలేదు. అసలు, ఆయన అలా అనడానికి కారణం యేమిటో ఆమె వూహకి అందలేదు.

“అదేమిటండీ ? మీరు రాకపోతే యెవరైనా యేమనుకుంటారుచెప్పండి!”

''ఒహరు అనుకునేదేమిటి శారదా : నేను వెళ్ళకపోతే, పెళ్ళి ఆగిపోదుగా!'' విసుగ్గానే అన్నాడు శంకర్రావు.

భర్త ఆ మాట అనడంతో, అతని నిర్ణయానికి యేదో కారణం వుంటుందని నిర్ధారణ చేసుకుంది శారద. అదేమిటో తెలుసుకోవాలన్న ఆసక్తి, ఆతృత కలిగాయామెలో.

“అంత విసుగెందుకండీ ? అసలు, కారణం యేమిటో చెప్పండి...మావాళ్ళేమైనా అసందర్భంగా ప్రవర్తించారా ? పోనీ అదైనా చెప్పండి ... వాళ్ళ తరపున నేను క్షమాపణ చెప్పుకుంటాను.'' అమాయకంగా అంది శారద.

“నీతో గొప్పచిక్కొచ్చింది శారదా!” అంతే అన్నాడుగాని, తను రాకపోవడానికి కారణం యేమిటో చెప్పలేదు.

శారదకి ఏడుపొచ్చినంత పనయ్యింది.

''మీరు రాకపోతే, నేను వెళ్ళడమెందుకు ? నేనూ వెళ్ళను...” అంది బుంగమూతి పెట్టుకుని.

“మంచి చిక్కే శారదా ! మీ చెల్లెలి పెళ్ళికి నువ్వు వెళ్ళకపోతే, నలుగురూ నన్ను ఆడిస్తారు...”

ముద్దంశెట్టి హనుమంతరావు

"ఊహూ ! అదంతా నాకుతెలీదు... మీరు రాకపోతే, నేనూ వెళ్ళను..." మొండిగా అంది.

శంకర్రావుకి యేం చేయడమో, పాలు పోవడంలేదు. తను యేవిషయమైతే చెప్ప దల్చుకోలేదో, అది యిప్పుడు చెప్పక తప్పదనుకున్నాడు.

"పెళ్ళికొడుకు పేరేమిటో చెప్పు.." అన్నాడు.

శారదకి అతని ధోరణి అర్ధంకాలేదు.

"ఆతడిపేరుకీ మీరు రాకపోవడానికీ సంబంధం యేమిటండీ ?"

"అది తర్వాత చెప్తాను... ముందు పేరుచెప్పు..."

"ప్రసాదరావు గా మోసు..." విసుగ్గా చెప్పింది.

"ఔనా ! ఆ ప్రసాదుగాడు నాకు ప్రబల విరోధి..వాడూ, నేనూ హైస్కూల్లో చదువు వెలిగించాంలే ! వాడిప్పుడు కాలేజీ చదువు ముగించి, డిగ్రీ సంపాదించా డనుకో !"

శారదకి భర్తచెప్తున్న వుపోద్ఘాత మంతా విసుగుకలిగించింది.

"ఇంతకీ, మీరు చెప్పదల్చుకున్న దేవిటండీ ?"



"బాగుంది...రామాయణమంతా విని, రాముడికి సీత యేమౌతుందని యెవరో నీలాంటివాళ్ళే అడిగారట...వాడు నాకు విరోధిగాబట్టి, వాడిపెళ్ళికి నేనురాను... రాదల్చుకోలేదు. ఈ సంబంధం తప్పి పోతుందేమోనని చూశానుగాని, లాభం లేకపోయింది..."

కారణం తెలీసంతవరకు శారద యెంత గాభరాపడిందో, తెలిశాక అంతగా నవ్వింది.

"మంచి వారేనండీ! ఇంకా మీలో చిన్నతనం పోనట్టుంది. ఇంతకీ మీరు **అతడు** పిలవగా వెళ్ళడంలేదుగా! మీ మరదలు పెళ్ళికి వెళ్తున్నారు...మా నాన్న మిమ్మల్ని ఆహ్వానించాడు." నవ్వుతూనే అంది శారద. పెళ్ళికి రాక పోవడానికి యిదో పెద్ద అవాంతరంగా భావించలేదామె.

"అయినా సరే శారదా! ఈ విషయలోమాత్రం నన్ను బలవంతం చెయ్యకు. వాణ్ణి చూస్తేనే నాకు అరికాలి మంట నెత్తికెక్కుతుంది...నువ్వు వెళ్ళిరా! నిన్ను ఆటంకపర్చను...ఎంత దూరమని మహా? మువ్వయిమైళ్ళేగా! ఒక్కగంట ప్రయాణం. ముందుగా వుత్తరం రాసివేస్తే, మీ నాన్న స్టేషనుకు వస్తాడు." అన్నాడు శంకర్రావు.

భర్త పట్టుదలకు చాలా బాధపడింది శారద. అతని సున్నితహృదయం గాయ పడిందని, ఆ గాయం మానడానికి సమయం తీసుకుంటుందనీ తీర్మానించు కుంది. ఏంచెయ్యడమా అన్న సందిగ్ధంలో పడింది. భర్తనువదిలి వెళ్ళనూలేదు ... వెళ్ళకండా వుండనూ లేదు. చెల్లెలి పెళ్ళాయె! వెళ్ళకపోతే, తలిదండ్రులమాట యెలావున్నా, చెల్లెలు యెంత బాధపడుతుందో ఆమెకితెలుసు.

"ఏవిటోనండీ మీ చాదస్తం! ఎప్పుడో స్కూల్లో విరోధం పడ్డారని, ఆ కక్ష యిన్నేళ్ళవరకూ మనసులో వుంచుకుంటే యెలాచెప్పండి? స్కూలు జీవితమేవేరు. అక్కడి వాతావరణం, అప్పటి సంఘర్షలు, ఆస్కూలు ఆవరణ లోనే వదిలిపెట్టి బైటపడాలని మా మేష్టరుగారు అప్పుడప్పుడు చెప్తుండే వారు. నా మాట వినండీ ... అవన్నీ మనసులో పెట్టుకోకండి, బైలుదేరండి." అంది ప్రాధేయపూర్వకంగా.

శంకర్రావుకి కోపం వస్తున్నా, ఆమె అమాయకత్వం, ప్రాధేయత, అతని కోపాన్ని అణచివేశాయి.

"నీతో వచ్చిన చిక్కే యిది శారదా! చెప్పింది అర్థం చేసుకోవు. కోపగించు కుంటే, కన్నీరు పెట్టుకుంటావు. నా భావాల్ని అర్థం చేసుకోడానికి ప్రయ త్నించు ... వాటిని చిత్రవధ చెయ్యకు. నా మనుస్సు నీకు తెలీందేమీ కాదు. అందుకే నన్ను బలవంతం చెయ్యొద్దని చెప్తున్నాను. ఈ రోజే మీ నాన్నకి ఓ వుత్తరం రాసేస్తాను. నువ్వు మాత్రం



"ఇంత పొడవు కిరీటము - అంత ఎత్తు చెప్పులు ధరిస్తే వేషధారి తాటిచెట్టు లాగా మరీ తయారౌతాడేమో ! ?......"

"మరేం ఫర్వాలేదులే ... ఏవరేజ్ మాన్కైతే నువ్వన్నది నిజమే...కాని మా హీరో వీటిని ధరిస్తే హీరోయిన్ ఎత్తుకి సమాన మవుతున్నాడు..."

యెల్లుండి ప్యాసింజరుకి బైలుదేరు..." అన్నాడు బోధపర్చే ధోరణిలో.

శారద, యెదురు చెప్పలేకపోయింది. ఎదురు చెప్పే మనస్తత్వమే కాదామెది. భర్త అంత పట్టుదలతో చెప్తుంటే, యింక బలవంతం చేసి, అతణ్ణి విసిగించడం యిష్టంలేదు.

"మీరు యెందుకు రాలేదని ఎవరైనా అడిగితే, ఏం చెప్పమంటారు ?" అంది నిస్పృహతో.

శంకర్రావు మొహంలో వికాసం వచ్చింది. "ఏం చెప్తావు ? వుందిగా బ్రహ్మాస్త్రం! ఎంత ప్రయత్నించినా శలవు దొరకలేదని చెప్పేసెయ్. వివాహ సమయాల్లో యిటువంటి అబద్ధాలు తప్పు కిందికి రావులే !" నవ్వుతూనే అన్నాడు.

"మీ యిష్టమే కానీయండి..." అంది శారద.

ఆ సమస్యేదో అప్పటికి పరిష్కార మైనట్టుగా నిట్టూర్చాడు శంకర్రావు... అసంతృప్తిగా నిట్టూరుస్తూ, అక్కణ్ణించి నిష్క్రమించింది శారద.

*　　　*　　　*

వివాహం నిర్విఘ్నంగా జరిగింది.

శంకర్రావు గురించి చాలా మంది అడిగారు. అందరికీ శారద తండ్రి కుటుంబరావు. శారద చెప్పిన జవాబే చెప్పాడు. అంతటితో వూరుకోక "ఆఫీసుల్లో యిచ్చే జీతాలు తక్కువయినా, శలవివ్వకుండా పని చేయించుకోవడం మాత్రం యెప్పుడూ జరుగుతున్నదే." అన్న వాక్యం కూడా కలుపుతుండేవాడు. తను రిటైరయ్యాడు గాబట్టి అంత ధైర్యంగా చెప్పగలుగుతున్నాడా విషయాన్ని. కాని, అతను సబ్ హెడ్‌గా వున్నపుడు యెంత మందికి శలవు ఇవ్వడంలో అల్లరిపెట్టేవాడో, అప్పుడే మర్చిపోయాడు కుటుంబరావు. అందరిలానే పెళ్ళికొడుకు ప్రసాదరావు కూడా అడిగాడు శంకర్రావు గురించి. రికార్డువేసినట్టుగా అదే జవాబు చెప్పాడు కుటుంబరావు.

కాని, ప్రసాదరావు ఆ సాకు నిజమైనదని నమ్మలేక పోయాడు. ప్రయత్నిస్తే, యేదీ అసాధ్యం కాదని అతని నమ్మకం. శంకర్రావు ప్రయత్న పూర్వకంగానే వుండిపోయాడని నిర్ధారణ చేసుకున్నాడు. తమ యిరిపురికీ యేనాడో జరిగిన కలహం యింకా అతని మనసులో రగులుతున్నదని వూహించడానికి ఆట్టే సమయం పట్టలేదు. శంకర్రావు మనస్తత్వం అతనికేం కొత్తకాదు. ఎంత సహృదయుడో సమయమొస్తే, అంత కఠిన హృదయుడనీ తెలుసు. జీవితపు బాటలో సంఘటిల్లే ప్రతీ సంఘటననీ యిట్టే మర్చిపోయి, కులాసాగా కాలం గడిపే వారూవున్నారు. కొన్ని సంఘటనలు మర్చిపోలేక మనసులో ఆట్టే పెట్టుకున్న వాళ్ళూ వున్నారు. అలా అని వాళ్ళు మంచివాళ్ళు కారని కాదు. వాళ్ళ మనస్తత్వం అంత ! ఆ కోవకి చెందినవాడే శంకర్రావని ప్రసాదరావు అభిప్రాయం.

* * *

శారద తిరిగి వచ్చేసింది. శంకర్రావు పెళ్ళి విశేషాలు అడిగాడు.

"మీరు యెందుకు రాలేదని ప్రతి వాళ్ళూ ప్రశ్నించడమేనండీ! గ్రామఫోను రికార్డులా ఒకే సమాధానం చెప్పడానికి నేనూ, మా నాన్నా, విసిగిపోయామంటే నమ్మండి..." అంది శారద.

వెళ్ళకపోవడం వల్లనే తన విలువ పెరిగిందేమోనని అనుకున్నాడు శంకర్రావు.

"పెళ్ళికొడుకు నన్ను గురించి అడిగాడా ?" ఆ ప్రశ్న అడక్కుండా వుండలేకపోయాడు.

"అడిగాడనే నాన్న చెప్పాడు. మీరు రాలేదని చాలా బాధ పడ్డాడట. శలవు దొరక్క కాదు — యింకేదో కారణం వుంటుందని కూడా అనేశాడట...".

"అదిగో ! నేను చెప్పానుగా ! వాడికీ మనసులో ఆ కషవుండబట్టే, అలా అనుమానించగలిగాడు. అందరూ నన్ను గురించి అడుగుతున్నారు గాబట్టి, వాడూ

అడిగాడు గాని, - లేకపోతే అడిగేవాడు కాదు..."

"ఏమోనండి మరి! అది అతని మనసుకే తెలియాలి..." అంటూ వూరుకుంది శారద.

వారం రోజులు గడిచాయి. ఆ రోజు ఆదివారం. ఉదయం యెనిమిది గంటలకు కాఫీ త్రాగి బజారుకి బైలుదేరాడు శంకర్రావు. శారద ఏవిఁటేవిఁటి తీసుకురావాలో దండకం చదువుతోంది. సరిగ్గా అదే సమయానికి గుమ్మంలో రిక్షా ఆగడం యిద్దరూ గమనించారు. ఎవరా అని కాస్త ముందు కొచ్చారు.

రిక్షాలోంచి మొట్ట మొదట ప్రసాదరావు దిగడం చూసి, శంకర్రావు కొయ్యబారిపోయాడనే చెప్పాలి. ఆ తర్వాత శారద చెల్లెలు దిగింది. తన యింటికి వచ్చిన అతిథి ప్రసాదరావు యిప్పుడు. మునుపటిలా విరోధి కాడు. అతిథి అన్నమాటేవిఁటి? సన్నిహిత బంధువు. అటువంటి వాణ్ణి, అదీ యింటికి వచ్చిన వాణ్ణి పలుకరించడమా మానడమా అన్న ఆలోచనల్లో మునిగిపోయాడు శంకర్రావు. ఆ సరికే ప్రసాదరావు, శారద చెల్లెలు లోపలికి వచ్చేశారు. చెల్లెల్ని యెంతో ఆప్యాయంతో ఆహ్వానించింది శారద. శంకర్రావు, ప్రసాదరావుని పలుకరిద్దామనుకుంటున్నంతలో, ప్రసాదరావేఅన్నాడు.

"నువ్వు మా పెళ్ళికి రాకపోయినా, నువ్వు పిలవకుండానే మీ యింటికి వచ్చాం శంకరం! ఒకప్పుడు సహపాఠకులం. యిప్పుడుతోటి అల్లుళ్ళం. మనం యెప్పుడన్నా అనుకున్నామా యిలా జరుగుతుందని?" నవ్వుతూనే అన్నాడు.

శంకర్రావుకి ఆ మాటల్లోని ప్రతీ పదం ఓ కొరడా దెబ్బలా తగిలింది. తన సంకుచిత తత్వానికి లోలోన సిగ్గుపడిపోయాడు. తను ఇంకా యిలా ప్రవర్తించ కూడదనుకున్నాడు. "నాకు శలవు దొరక్క మీవివాహ సందర్భంలో రాలేకపోయాను ప్రసాద్ ... దానికేం లే! ఇప్పుడు మీ ఇద్దరూ మా ఇంటికిరావడం మా కెంతో ఆనందంగా వుంది. ఏం మరదలా_నీ పెళ్ళికి రాలేదని కోపగించుకోకు సుమా!...అఁ_ప్రసాద్ లోపలికిపద... నేనలా బజారుకి వెళ్ళివస్తాను. ఈలోగా నువ్వు స్నానం ముగించు..." అంటూ చరచరా బైటికి నడిచాడు.

భర్త తత్వం శారదకి అవగాహన కాలేదు. ఆనాడు కక్షగట్టి అసహ్యించుకున్న ప్రసాదరావుతో, యిప్పుడు యింత ఆప్యాయంగా మాట్లాడారే! వాళ్ళే తనింటికి వచ్చారన్న ఆధిక్యతతో కక్షమాట మర్చిపోయారా!,..యేవిటో ఆమె యిదమిత్థమని తేల్చుకోలేకపోయింది. ఎలాగవుతేనేం - వాళ్ళిద్దరూ గతాన్ని మర్చిపోయి కొత్తఅనుబంధాన్ని యేర్పరచుకోవడమే అంతా వాంఛించేది ... అదే జరిగింది గనుక తృప్తిగా నిట్టూర్పు విడిచింది శారద.







1. "బొమ్మలకే ప్రాణం వస్తే..."

# భావకవిత్వంలో శృంగార నాయికలు

డా॥ సి. నారాయణరెడ్డి

## ప్రస్తావన

మన భావకవిత్వంలో నాయికా శృంగారం శిఖరస్థానం అందుకున్న కావ్యాలు కృష్ణశాస్త్రిగారి ఊర్వశి, విశ్వనాథవారి కిన్నెరసాని పాటలు, నండూరి వారి యెంకిపాటలు, బాపిరాజుగారి శశికళ, తల్లావజ్ఝలవారి హృదయేశ్వరి, నాయని వారి సౌభద్రుని ప్రణయయాత్ర. వీటిలో ఊర్వశి, శశికళ, హృదయేశ్వరిలోని నాయిక, సౌభద్రుని ప్రణయ యాత్రలోని వత్సల ఆయా కవుల వైయక్తిక ప్రణయాన్ని చూరగొన్న సుందరీ మణులు. వీటిలో ఊర్వశి, శశికళ లౌకిక వాసనలకు అతీతమైన ఊహాసృష్టులుగా గూడ స్థూలంగా కనిపించకపోరు. హృదయేశ్వరిలోని నాయిక (పేరు ఇదమిత్థంగా లేదు), వత్సల లౌకిక గంధమున్న నాయికలుగా భాసిస్తారు. ఆ కవుల నిత్య జీవితంలో పెనవేసుకొనిపోయిన వాస్తవికమూర్తుల్లా పీ రగుపిస్తారు. కిన్నెర, ఎంకి అలా కనిపించరు. కవితా కళా దృష్ట్యా ఆ కవులను కదలించి రూపు దిద్దుకొన్న అమృతమూర్తుల్లా స్ఫురిస్తారు. ఈ శృంగార నాయికల్లో ముఖ్యమైన వారిని గూర్చి ముందు ముందు వివరిస్తాను. ఈ వ్యాసంలో మాత్రం కొందరు విదేశకవులు తాము ప్రేమించిన సుందరీ మణులను ఎలా కావ్య నాయికలుగా మలచుకున్నదీ పేర్కొంటాను.

## కవులు ; వారి ప్రేయసులు

నిత్యజీవితంలో చూచిన సుందరికి హృదయ మర్పించి ఆమెను త్రికరణ శుద్ధిగా ఆరాధించిన కవులు మన ప్రాచీన సాహిత్యంలో కనిపించరు. వారు ప్రేమించిన సందర్భాలూ సన్నివేశాలూ ఉండి వుంటాయి. కానీ వాటిని వారు కావ్యాల్లో ప్రదర్శించలేదు. పూర్వ కాలంలో ఆత్మాశ్రయ కవిత్వానికి అస్తిత్వం లేకపోవడం ఇందుకొక కారణమై వుంటుంది. సంస్కృత సాహిత్యంలో 'పద్మావతీ చరణ చారణ చక్రవర్తి' యైన జయదేవకవి ఇందుకు అప

వాదరిగా కనిపిస్తాడు. కాళిదాసు, శ్రీనాథుడు మొదలైన కవులకు సంబంధించిన శృంగార గాధలున్నవి గానీ, ఆ కవులు వాటి కంతగా అక్షర రూపమివ్వలేదు. ఇరువయ్యో శతాబ్దిలోని మన భావకవులు తమ ప్రేయసీమూర్తులను కావ్య నాయికలుగా చేసి గొప్ప నవ్యతను సాధించారనాలి. మన భావకవులకీ ధోరణి పాశ్చాత్య కవులనుంచి సంక్రమించింది. పాశ్చాత్య సాహిత్య జగత్తులో చాలా కాలంనుంచి కవులు తాము ప్రేమించిన తరుణులను గూర్చి భావగీతా లల్లడం పరిపాటిగావుంది. జీవిత కాలమంతా ప్రేయసి కొరకు తహతహలాడి, పలికిన ప్రతి పదంలో, పాడిన ప్రతి గీతంలో ఆమె సంకీర్తనం చేసిన కవులూ ఉన్నారు. తమ ఆశా నిరాశలను, వేడుకలను, వేదనలను ఆవిడపేర వెలిబుచ్చుకున్నారువారు. డాంటీ, పెట్రార్క్, సిడ్నీ, షేక్స్పియరు, షెల్లీ, కీట్సు, బైరన్, బ్రౌనింగు, రోసెటీ మున్నగువారు ఈ శ్రేణికి చెందిన ప్రసిద్ధ కవులు.

డాంటీ పేరుమోసిన ఇటాలియన్ కవి. ఈతడు తన తొమ్మిదో యేటనే బ్యాట్రిస్ పోర్టినారీ (Beatrice portinari) అనే అమ్మాయిని ప్రేమించాడు. అప్పుడా అమ్మాయి వయస్సుకూడా తొమ్మిదేళ్ళే. తరువాత ఇరువురూ పెళ్ళి చేసుకున్నారు. ఆవిడ తన యిరువది నాల్గోయేటనే మరణించింది. డాంటీకి తన ప్రేయసి ఆదర్శమూర్తి,జీవనదేవతా అయింది, అతని కవితా తంత్రికలను ఝుమ్మనిపించిన రసరాజ్ఞి ఆవిడే. డాంటీ కావ్యాల్లో మకుటమణిలాంటి డివైన్ కామెడీలో ఆవిడ 'ముక్తి సీమంతిని'గా వర్ణింపబడింది.

పెట్రార్క్ ఇటలీ దేశపు కవి. ఇతడు లారా (Laura) అనే సుందరిని ఒక శుక్ర శుభవాసరం నాడు చర్చిలో దర్శించాడు. ఆవిణ్ని చూడగానే అతనికి వలపు తలపులు మొలకలెత్తాయి. అప్పటికే ఆమె వివాహిత, అయినా అతడు లారాను ప్రేమించడం మానలేదు. పెట్రార్క్ తొలి రచనల్లో అసంపూర్ణ ప్రణయంకోసం, అందని లక్ష్యంకోసం చేసే వేసటే లేని 'వెర్రి అన్వేషణం' చిత్రింపబడింది. ఆమె బ్రతికుండగా, గతించిన తర్వాతా, ~~ఈ కవి దాదాపు~~ 366 గేయాలను ఆమెను ఉద్దేశించి వ్రాశాడు. తన సుందరస్వప్నం చెదరిపోగా ఈ కవి లోకాని కెదురు తిరగలేదు. ఇంద్రియ వాసనలకూ ఆధ్యాత్మిక

చింతనలకూ జరిగిన సంఘర్షణకు తీయని విషాద సంగీతం సమకూర్చాడు. ఈకవి లారా నుద్దేశించి వ్రాసిన సానెట్లు శతాబ్దాల తరబడిగా పాశ్చాత్య వాఙ్మయాన్ని ప్రభావితంచేశాయి. పెట్రార్క్, లారా అన్న పేర్లు తాత్త్విక భావదమితమైన కామోద్రేకానికి (Passionate Love) సంకేతాలుగా నిలిచిపోయాయి.

ఇంగ్లీషుకవుల్లో ఫిలిప్‌సిడ్నీ వ్రాసిన 'Astrophel and stella' అనే గ్రంథం ప్రణయగీతాల సంపుటి. ఈ గీతాల్లో నాయిక స్టెల్లా. సిడ్నీ తాను చిన్ననాడు ప్రేమించిన లేడీరిచ్ అనే అమ్మాయి మరొకరిని పెళ్ళాడగా కలిగిన ప్రణయ భంగంతో ఈ గీతాలు వ్రాశాడనీ, స్టెల్లా అనేది ఆవిడ నుద్దేశించి పెట్టుకున్న పేరనీ సిడ్నీలీ అనే విమర్శకుడు అభిప్రాయపడినాడు. వాస్తవిక జీవితంలో సిడ్నీ ప్రేమించిన తరుణే స్టెల్లా అని అనే వాళ్ళు కూడా లేకపోలేదు. ఏమైతే నేమి, స్టెల్లా పట్ల సిడ్నీ ప్రదర్శించిన ప్రణయారాధనతత్త్వం మాత్రం ఎలిజబెత్ కవిత్వయుగంలో ఒక సంప్రదాయంగా నిలిచిపోయింది. స్పెన్సరువంటి మహాకవి స్టెల్లా నిలా ప్రశంసించాడు.

'Stella the faire, the fairest star in skie
As faire as venus of the fairest faire.'

ఇంగ్లీషు ప్రేమ గీతాల్లో షేక్స్పియరు సానెట్లు చాలా ప్రసిద్ధి పొందాయి. ఇవి 'Dark Lady' నుద్దేశించి వ్రాసినవి. ఈ 'Dark Lady' షేక్స్పియరు ప్రేమించిన భామినియొక్క అవ్యక్త నామం. కొందరేమో ఆవిడ అతని ఆదర్శ ప్రణయానికీ, ఊహా సౌందర్యానికీ ప్రతీక అంటారు. కాని సానెట్ల లోని కొన్ని వర్ణనలనుబట్టి చూస్తే ఒకానొక తరుణి ఈ కవి హృదయాన్ని దొంగిలించినట్లే అనిపిస్తుంది.

I do forgive any robbery, gentle thief.
Although thou stealthee all my poverty.'

మరో సానెట్‌లో ఈ కవి ఆవిడను చూపుల తూపులతో తనకు శాశ్వతముక్తి ప్రసాదించుమని ఆక్రందించాడు.

............but since I am near slain, kill me outright with looks, and rid my pain.' ఇలాంటి సందర్భాలనుబట్టి ఆలోచిస్తే 'Dark Lady' గురించి వాస్తవికతాభ్రాంతి కలుగక పోదు. అయితే కొన్ని సానెట్లలోవున్న ప్రేమ స్నేహాల ఘర్షణనుబట్టి కొందరీ

రకంగా ఊహించారు. ఈ కవి ప్రేమిం చిన యువతి అతని ప్రియమిత్రుణ్ణి ప్రేమించింది. మొదట అతడు నిర్విణ్ణుడైపోయాడు. క్రమంగా శాంతి నలవరచుకొని ఆవిణ్ణి స్వీకరించమని మిత్రుణ్ణి కోరాడు. ఈ గీతాల్లో అక్కడక్కడా కనిపించే అతీంద్రియ సౌందర్యారాధన దృక్పథం ఈ విషయాన్నే ధ్వనింపజేస్తుంది.




ఇంగ్లీషు కాల్పనిక కవుల్లో కీట్సు, షెల్లీ, బైరన్‌ల భగ్నప్రేమగాథలు సుప్రసిద్ధమైనవి. కీట్సు ఫ్యానీబ్రౌన్ (Fanny Browne) అనే అమ్మాయిని ప్రేమించాడు. ఫ్యానీలేని గదిలోని గాలి తనకెంతో అనారోగ్యకరమనీ, ఆవిడ కోసం తాను ప్రాణదానం చేయడానికి గూడా సిద్ధంగా వున్నానని ఈ కవి ప్రకటించాడు. బ్రతికుండగా ఆవిడ నీతడు పొందలేకపోయాడు. పొందినది తృణీకారం మాత్రమే. ఆవిడను ప్రేమించినప్పటి వివిధ మానసిక దశలు అతని 'ఓడ్ టు నైటింగేలు' లో, 'ఓడ్ టు ది గ్రీషియన్ అర్న్' లో, 'ఎండిమియాన్' లో ప్రతిఫలించాయి. 'Ode to Fanny' అనే గేయం ఆవిడ తనను తిరస్కరించిన తర్వాత వ్రాసింది. 'Lamia' అనే గేయంలో లామియా ఎవరో కాదు ఫ్యానీయే అంటారు. ఆవిడ దీంట్లో సర్పకన్యగా చిత్రింపబడింది. దీంట్లోని ప్రేమికపాత్ర Lycins మరెవ్వరోకాదు, కీట్సే. ఫ్యానీ సర్పంలా ప్రవర్తించి తనను నాశనం చేసిందన్న విషయం ఈ గేయంలో ధ్వనింపజేశాడు.

షెల్లీ మొదట హారియట్ గ్రోవ్ (Harriet Grove) అనే కన్యను ప్రేమించాడు. ఈ ప్రేమ నడుమనే విరిగిపోయింది. తర్వాత ఇంకో అమ్మాయి హారియట్‌ను వివాహమాడాడు. పెళ్ళి తర్వాత ఎమిలియా వివియానీ (Emilia Viviani) అనే తరుణిని ప్రేమించాడు. 'Epipsychidion' అన్నది వివియానీని దృష్టిలో పెట్టుకొని వ్రాసిన ప్రణయకావ్యమే. షెల్లీ

Mrs. Williams అనే యువతినిగూడా ప్రేమించాడు. 'Rarely Rarely', 'Spirit of Delight', 'One word is too of ten', 'Rough wind', 'Magnetic Lady' మున్నగు గేయాలన్నీ ఈవిడను దృష్టిలో పెట్టుకొని వ్రాసినవే అంటారు.

బైరన్, మేరీ చావర్త్ (Mary chauworth) ను మనసారా ప్రేమించాడు. 1805 మొదలుకొని, ఆవిడకు మరొకరితో పెళ్ళి జరిగినంతవరకు, అంటే సుమారు పందొమ్మిదేళ్ల కాలంలో ఈతడు వ్రాసిన ప్రణయగీతాలన్నిట్లో ఆవిడే ఏదో ఒక రూపంలో తళుక్కు మన్నది. Manfred లోని నాయిక ఈవిడే. Don Jaun అనే కావ్యంలో లేడీ ఎడిలీన్ పాత్ర ఈపిడే. 'The Dream' అనే గేయంలో ఈ భగ్న ప్రణయమే ఇతివృత్తంగా మారింది. 'Lost words to Greece' అనే గేయంలోనూ ఈ ప్రణయవేదన స్ఫురిస్తున్నది. బైరన్‌లా కాకుండా బ్రౌనింగు తాను ప్రేమించిన ఎలిజబెత్ బ్యారెట్‌తో ప్రణయకలాపం సాగించి, ప్రణయ గీతాలు కురిపించి, చివరి కావిడను పెండ్లి చేసుకున్నాడు. స్విం‌బర్న్, రోసెటీ మున్నగు కవులు ప్రణయంలోని అయోగ సంయోగవియోగదశలనుగూర్చి ఏదో ఒకరూపంలో వెల్లడించినవారే.

మన భావకవులు ఈ కవులందరి ప్రణయ కలాపాలనూ, తత్ఫలితంగా వారు రచించిన గేయాలనూ పరిశీలించడానికి వీలు చిక్కింది. ఆంగ్లవిద్య ఇందుకు దోహదంచేసింది. తరుణ దశలోవున్న మన భావకవులను ఇంగ్లీషు కవుల స్వచ్ఛంద ప్రణయం ఆకర్షించింది. వారిలాగే వీరూ ప్రేమించసాగారు. వారిలాగే వీరూ భగ్నాశులై ప్రణయ కావ్యాలు రచించారు. కొందరు తమ ప్రేయసులనే నాయికలుగా మలచుకొన్నారు. మరికొందరు అందని ఆదర్శ సౌందర్యాన్ని ఊహాప్రేయసుల రూపంలో మూర్తీభవింపజేశారు. ఊర్వశి, కిన్నెరసాని, శశికళ మున్నగు శృంగారనాయికలు కొంత వాస్తవిక సౌందర్యదృష్టి, కొంత ఆదర్శ సౌందర్య సృష్టి మేళవించుకొన్న దివ్యమూర్తులు. వత్సల, హృదయేశ్వరిలోని నాయిక చాలా వరకు కవుల నిత్యజీవితాలను ఒరసికొని ప్రవహించిన రసధునులు; రమణీమణులు. ఈ నాయికల గురించి కవితాదృష్ట్యా చర్చించడమే ఈ వ్యాస పరంపర ఉద్దేశ్యం. 

# అల్లుడు వచ్చాడు

ఇసుకపల్లి లక్ష్మీసావిత్రి





బండి చప్పుడు వినపడేటప్పటికి రాఘవయ్యా వాలుకుర్చీలోంచి ఉలిక్కిపడి లేచి వాకిట్లోకి వచ్చాడు. కొండముచ్చు ఎదురింటి గోడమీద కూర్చుని కనపడింది. దానిని చూసేటప్పటికి వళ్ళుమండింది. 'ఛీ...' అన్నాడు. అది వెక్కిరించింది. రాఘవయ్యా అరుగు మీద ఇటిక రాయిముక్క ఉంటే విసిరాడు దానిమీదకు. అది ముందుకు ఉరికింది. రాఘవయ్యా రెండడుగులు వెనక్కు వేసి సావిట్లోనుంచి దొడ్లోకి వచ్చాడు



